# Sri Hazarath Tajuddin Baba

Pujya Acharya Sri Ekkirala Bharadwaja

# శ్రీ హజరత్ తాజుద్దీన్ బాబా

దివ్య చరిత్ర



పూజ్య ఆచార్య శ్రీ ఎక్కిరాల భరద్వాజ

# ద్రష్ట - దర్శకులు, ఆచార్యులు

పూజ్యశ్రీ ఆచార్య భరద్వాజ గారిని నేను 1979వ సంవత్సరం మే మాసంలో ఒంగోలులో ఒక మిత్రునితో కలసి యింకొక మిత్రుని యింట దర్శించినాను. వీరిని విద్యార్థులు, అనుయాయులు, శిష్యవర్గము 'మాస్టరుగారు' అని పిలుస్తూ ఉంటారు. ఈ మాస్టరుగారనే పిలుపులో గురుభావం వున్నది. ఈ గురుభావాన్ని తెలియపరిచే మాస్టరుగారు అనే పదాన్ని నా ఈ పరిచయ వాక్యాంలో వాడుకుంటున్నాను. నేను వీరిని దర్శించినపుడు వీరు బాబాను గురించి, వారి తత్వాన్నిగురించి ప్రవచిస్తూ ఉన్నారు. ప్రవచించే వారి వాక్కులను, వారి స్ఫురద్రూపమును చూసి వీరు ఆత్మారూఢులైన యోగి పుంగవులని నిర్ధారించు కున్నాను. ఎంతో మంది మహాత్ముల ప్రవచనాలు నేను యిదివరకు విన్నప్పుడు అవి రమ్యమైన వాక్కులతో వుండి శాస్త్రార్థాన్ని వివరించేవిగా మాత్రమే వున్నవి. వీరి ప్రవచనాల్లో వారి ఆత్మానుభూతి ప్రస్ఫుటంగా ద్యోతకమవుతున్నది. వారి సన్నిధి ప్రభావం శ్రోతలకు శాంతిని చేకూరుస్తున్నది. వారి సన్నిధి ప్రభావము నా హృదయము పైన గాఢమైన ముద్ర వేసినది. వీరిని గురించి తెలుసుకోవలె ననే ఆతురతతో వారి సన్నిహితులను కొందరిని వారిని గురించి విచారించి వారి సాంప్రదాయము, వారి సాధన, వారి జిజ్ఞాస, వారి అన్వేషణ, వారి యోగవ్యాప్తతను గురించి కొద్దిగా తెలుసుకోగలిగాను.

భారతదేశంలో ప్రఖ్యాత వేద పండితులుగా పేరుగాంచి యోగారూఢులై ఆంగ్ల విద్యలో యమ్.ఏ. పట్టభద్రులైన బ్రహ్మశ్రీ అనంతాచార్య గారికి నాల్గవ కుమారుడుగా వీరు తే. 30-10-1938వ బాపట్లలో జన్మించినారు. తండ్రి పెంపకంలో, శిక్షణలో తీర్చిదిద్దబడి యమ్.ఏ. పట్టభద్రులై కళాశాలలో ఆంగ్లోపన్యాసకులుగా కొంతకాలముండి చివరన విద్యానగర కళాశాలలో పనిచేస్తూ వుండి ఒంగోలుకు వచ్చి స్థిర నివాసమేర్పరచుకున్నారు. వీరు బాల్యము నుండి జిజ్ఞాసువుగా వుండి అన్ని విషయాలను చక్కగా ఆకళింపు చేసుకొని ఏకసంధాగ్రాహిగా వుండేవారని, మంచి పట్టుదల కలవారనీ వారి తల్లిగారు (ఎక్కిరాల లక్ష్మి) తెలియపరచారు. వీరు చాలా గాఢంగా నిద్రపోవడం బాల్యము నుండే వుండేదని, ఆసనాలు వేస్తూనే నిద్రపోయేవారని, అన్నం పెడుతుంటే

నిద్రపోతూనే వినేవారని వారి తల్లిగారు తెలియపరిచారు. 12 ఏళ్ళకే కాశీ విశ్వవిద్యాలయములో మెట్రిక్ పరీక్ష పాసయ్యారు. చిన్నతనంలో ఏదన్నా కొనడానికి బజారుకు పంపినప్పుడు త్రోవలో గారడీవాడు గారడీ చేస్తుంటే మాస్టరుగారు ఆ గుంపులో నిలబడి గారడీవాడిపై దృష్టి నిలిపితే తనపై ఎవరో మంత్ర ప్రయోగం చేస్తున్నందువల్ల తన గారడీవిద్య చేయలేదని జనం వైపు చూచి మాస్టరు గారి దగ్గరకు వచ్చి, "బాబూ! నువ్వు వెళ్ళిపో. నీకు పుణ్యం ఉంటుంది.నాకు 4 పైసలు దొరుకుతాయి" అని బ్రతిమి లాడుకొని మాస్టరుగారిని అక్కడ నుండి పంపించేశాడు. అంటే తండ్రిగారు నేర్పిన యోగాభ్యాసాలు, ప్రాణాయామం ద్వారా బాల్యంలోనే చక్కని సాధనతో యోగదృష్టి సాధించగలిగారు.వీరికి నుండి సమయస్ఫూర్తి కల్గి ధైర్యముతో వుండేవారు. వీరి నాన్నగారికి పక్షవాతము రాబోతున్నదని తెలుసుకొని వీరి ముగ్గురు అన్నలూ కంటతడి పెడితే, 7 సంవత్సరాల చిరుతప్రాయంలోనే వున్న వీరు. "తెనాలిలో అనుభవైన వైద్యులున్నారు కదా, వారి దగ్గరకు పోదామని" సలహా యిస్తే తండ్రిగారు ఎంతో సంతోషపడి, ఆ సలహాను పాటించి అనుభవైన వైద్యులను చేరుకొని వాళ్ళ సహాకారంతో తామే సొంత వైద్యం చేసుకొని తమ రోగాన్ని నయం చేసుకున్నారు. వీరి నైతిక ప్రవర్తన గూర్చి వారి తల్లిగారు మరో సందర్భం అనే సావనీరులో తెలియపరిచిన విషయాలు వారి వాక్యాలలోనే తెలుసుకుందాము.

"భరద్వాజ మొదటి నుండీ వేషధారణలో చాలా నిరాడంబరుడు. తన బట్టలు ఎలా ఉన్న పట్టించుకొనేవాడు కాదు. బి.ఏ.కు వచ్చేవరకు పొట్టిలాగులు వేసుకొనే వాడు. వాటికి గుండీలు వూడిపోతే వాటిని లుంగీలా దోపుకొని మొలత్రాడును ఒక వుల్లతో బిగించుకొనేవాడు. తనకు ఏ వస్తువు లేకపోయినా ఎవరినీ అడుగడు. ఏమనీ అనడు. ఏది ఎలా వున్నా పర్వాలేదు అనే నిర్లిప్త భావన మన భరద్వాజకు చిన్నప్పటి నుండే అలవడింది. తన వేషము, రూపాలు గురించి ఇతరులు ఏమనుకుంటారన్నది పట్టించుకొనక తనకు నచ్చుననిపించిన రీతినే అనుసరిస్తాడు. సం॥ 1955లో తాను బి.ఏ.లో కళాశాలలో చేరేముందు ఉపనయనం చేసుకుంటుంటే పంచెలు గాని, జుట్టు పూర్తిగా తీసివేయించు కోవడమా చేస్తే సాటి విద్యార్థులు ఎగతాళి చేస్తారని అందరము హెచ్చరించినా,

అతడు వెనక జుట్టు తీయించుకొని అలాగే కాలేజీకి వెళ్ళాడు. తనను ఎగతాళి చేసిన విద్యార్థులతో "మీలో మీ తలపై వున్న వెంట్రుకలు మాత్రమే విలువయినవైతే, వాటిని తీయించుకోవడానికి భయపడాలి. విలువైనది ఈలోపలనే వున్నదన్న ధైర్యముంటే జుట్టు తీయించుకోవడానికి భయపడ్డమెందుకు ?" అన్నాడు. మా వాడి హాస్యమూ, సమయస్ఫూర్తి గూడ ఓటమి ఎరగవు. మా వాడు ఇంటర్మీడియట్ పరీక్షలో తప్పాడు. పాసైన వారంతా టీ పార్టీలు చేసుకుంటుంటే భరద్వాజ తాను తప్పినందుకు టీ పార్టీ యిచ్చాడు. అందులో ముఖ్యంగా తెలిసిన ఒక సహపాఠి అంతా అయ్యాక, "నీకు సిగ్గులేదా, పరీక్షల్లో తప్పి గూడా పార్టీ యిచ్చావు?" అంటే "నీకు పరీక్షల్లో పాసవడం అన్నకొక శివరాత్రి" అంటే నాకు "ఫెయిలౌ" అవడం అన్నకొక శివరాత్రై సిగ్గంటూ వుంటే అది పాసైనప్పుడు టీ పార్టీ యిచ్చే వారికి ఉండాలి." అన్నాడు. సం॥ 1957 నాటికి వాళ్ళ నాన్నగారికి మనల జబ్బు చేసి పెట్టి పంపారన లేక ఆర్థికంగా ఇబ్బందిపడ్డాము. అది తెలిసిన భరద్వాజ ఎమ్.ఎ. చదివినంతకాలం గూడా తలకు నూనె, గుడ్డలకు యిస్త్రీ, కాళ్ళకు చెప్పులు లేకుండానే యూనివర్సిటీలో చదువుకున్నారు. పాఠ్యగ్రంథాలు గూడా తన సహపాఠుల విశ్రాంతి సమయంలో వారి వద్ద తెచ్చుకొని చదువు కునేవాడు. సం॥ 1961లో తాను లెక్చరర్ అయ్యాకనే మొదటిసారి కాళ్ళకు చెప్పులు, యిస్త్రీ గుడ్డలు ధరించసాగాడు. ఇరవై సంవత్సరాల యుక్తవయస్సులో గూడా ఎలాంటి ఆకర్షణలకు గూడా లోబడేవాడు కాదు. ఒకసారి మాకు తెలిసిన వాళ్ళమ్మాయి మా వాడికొక ప్రేమలేఖ వ్రాసింది. అతను తనను పెళ్ళిచేసుకోకుంటే ఆత్మహత్య చేసుకుంటానని వ్రాసింది. భరద్వాజ, "నేను నిన్ను చేసుకోకుంటే నీవు చనిపోతావేమో గాని, నిన్ను చేసుకుంటే మాత్రం నేను చచ్చిపోతాను. నేను చచ్చిపోవడం నా కిష్టం లేదు". అని వ్రాశాడు. తర్వాత ఒకప్పుడు ఆ గడుసరి పిల్ల కనిపించి, "వయస్సులో వున్న ఆడపిల్ల పలకరించి వస్తే దూరంగాపోతావే, నీకు మగతనం లేదా?" అని అడిగింది. భరద్వాజ నవ్వి, "నాకూ స్త్రీ వ్యామోహం వుండేది గాని నిన్ను చూచాక అది కాస్తా తొలగిపోయింది" అని చురక అంటించాడు. అదేమి చిత్రమో గాని, తర్వాత ఆ పిల్లకు వివాహమై కొద్ది నెలలలోనే ఆమె భర్త చనిపోయాడు.

మావారు తమ పిల్లలలో డబ్బుమీద వ్యామోహం కలిగించేవారు కారు. అది ఆయనకే లేదు. మన మీద మనకు విశ్వాసం లేకుంటేనే డబ్బు మీద విశ్వాసం వుంటుందని ఆయన అనేవారు. అదే పోలిక మన భరద్వాజకూ వచ్చింది. కళాశాలలో ఉపాధ్యాయుడు అయ్యాక తనను చేతనైతే ఐ.ఏ.యస్. పరీక్షలో పాసవమని మా రెండవ అల్లాయి వేదవ్యాసు సలహా చేస్తే, అతడు పట్టుదలతో ఆ పరీక్ష పాసై హిమాచల్ ప్రదేశ్ సర్వీసుకు ఎన్నికైనప్పటికీ అది తన స్వేచ్ఛకు, నైతిక జీవితానికి ప్రతిబంధకమని తలచి విడిచిపెట్టాడు. తాను నమ్మిన ఆధ్యాత్మిక అన్వేషణ కొరకు రెండుసార్లు స్థిరమైన ఉపాధ్యాయ పదవికి రాజీనామా చేసి తరువాత ఒక్కొక్క సంవత్సరం పాటు నిరుద్యోగిగా ఉన్నాడు. అయినప్పటికీ వాళ్ళ నాన్నగారి దగ్గర నుండి గాని, అన్నల నుండి గాని, మరే మిత్రుల నుండి గాని ఒక్క పైసా అయినా సహాయం పొందలేదు. ఒక్క నెల రోజులైనా ఆశ్రయం కోరలేదు. ప్రతిసారి తనకున్న సర్వస్వంతా విడిచి పెట్టుకొని మరల ఆంగ్లశాఖలో అందరికంటే చివరివాడుగా చేరాడు. ట్యూషన్లు చెప్పిగాని, గైడ్లు వ్రాసి గాని డబ్బు ఎన్నడూ సంపాదించలేదు. మాకు తెలిసి తనకొచ్చే జీతంలో ఎందరో పేద విద్యార్థులకు చదువు చెప్పించాడు. నిరుద్యోగులెందరికో డబ్బు సహాయం చేస్తుండేవాడు. కొందరికి బ్యాంకులో అప్పు ఇప్పించి వాళ్ళు చెల్లించకపోతే అదంతా తానే కట్టుకున్నాడు. తనకొచ్చిన పేరు తన కోసంగా ఎన్నడూ ఉపయోగించుకోలేదు. అతడు ఇచ్చిన సహాయము, అతని పేరు, పలుకుబడి, సలహాలు వినియోగించు కొని ఎందరో జీవితంలో స్థిరపడ్డారు. అయినప్పటికీ వాళ్ళనుండి కించిత్తైనా సహాయం గాని, లేక కృతజ్ఞత గాని ఆశించక, వాళ్ళల్లో కొందరు అతనినే విమర్శిస్తున్నా పట్టించుకోనక. "వెనుక వాళ్ళు గౌరవించినది నేనంటే వాళ్ళకప్పు డున్న అభిప్రాయాన్నే. ఈనాడు విమర్శిస్తున్నది గూడ ఈనాడు వాళ్ళకు నేనంటే వున్న అభిప్రాయాన్నే. వాళ్ళ పరిపాకమంతే, వాళ్ళ శక్తికి మించినది వాళ్ళు చేయలేక పోవడం నేరమేమి కాదుగదా ? నాన్నగారు చెప్పినట్లు శక్తివంచన లేకుండా సమాజానికి మేలు చేయడం ఒక్కటే మన పని, దాని విలువ తెలుసు కొని ఉపయోగించుకోవడమో, తెలుసుకొనక దానిపై బురదచల్లడమో అనేది సమాజం యొక్క ప్రాప్తాన్ని బట్టి

వుంటుంది" అంటాడు. ఎంతెంతో కట్నాలిస్తామని ఎన్నో పెళ్ళి సంబంధాలు వచ్చినా మా వాడు లక్ష్యపెట్టలేదు. మహాత్ములు ఆదేశించాక వాళ్ళు సూచించిన సంబంధాన్ని కట్నం కించిత్తైనా తీసుకోకుండా వివాహం చేసుకొని ఆదర్శవంతమైన గృహస్థ జీవితం గడుపుతున్నాడు. అతడు చెప్పినట్లే తనను గురించి వాళ్ళ తాతగారు కనిన కలలు, నిరంతరం కష్టించి యిచ్చిన సంస్కారము అతడిలో సార్థకమయ్యాయి. అవాంఛనీయమైన పరిస్థితులెంతో బలమైనవి ఎదురై, తనను ఉద్యోగానికి దూరం చేసినా అతడు కించిత్తైనా తల ఒగ్గక ఉత్తమమైన కార్యక్రమం చేసుకుంటూ పోతున్నాడు. ఇటీవల నెలకు 4,5 వేలకు తక్కువ లేకుండా జీతమిస్తామని రెసిడెన్షియల్ కళాశాల వారు ఎంతగా ఆహ్వానించినా అది తన కార్యక్రమానికి అవరోధమని తలచి అంగీకరించలేదని తెలిసింది. అతని పసితనంలో తల్లి పోయినదగ్గర నుండి వాళ్ళ నాన్నగారే తల్లియై పెంచినందుకు, గురువై ప్రాచీన గురుకుల విధానంలో చదువు, సంస్కారము అందించినందుకు,ధన - కీర్తి -సుఖ భ్రాంతులనే తెగుళ్ళు రాకుండా సంరక్షించినందుకు మా భరద్వాజ అన్నింటిని సార్థకం చేసుకొని అలనాటి భరద్వాజ మహర్షిలా తన పితృఋణమును, దేవ ఋణమును, ఋషి ఋణము పుష్కలంగా తీర్చుకుంటున్నారు".

మాష్టరు గారి మమతను చూరగొన్న వారి పెద్దన్న గారి రెండవ అబ్బాయి 1955లో వారి ఉపనయనమప్పుడు అకస్మాత్తుగా చనిపోయినాడు. అప్పటి నుండి జనన మరణాల తత్త్వం గురించి, ఆత్మ పరమాత్మల ఉనికిని గురించి వారి హృదయంలో కల్గిన విచార ధార తీవ్రమైన అన్వేషణగా సాగి, 1961లో ఊరి బయటకు నడుస్తూ వున్నప్పుడు, వారు అప్పటి వరకూ చదివినవి, ఆలోచించినవీ, అన్నీ సమన్వయపడి, ఒకానొక గాఢమైన శాంతి కలిగినదని మాష్టరుగారే సాయిలీలామృతంలోని గురుస్తుతి అనే అధ్యాయంలో తెలియపరచారు. వారి విచారధార నిత్యానిత్య వివేకములోనికి దారి తీసి, దేహత్రయమునకు అధిష్ఠానమైన బ్రహ్మమునందు విచారించేటట్లు చేసింది. మిథ్యాభూతమైన భౌతిక వస్తుజాలమునుండి మనస్సు విరక్తి చెంది సత్యమైన బ్రహ్మవస్తువునందు స్థిరముగా నిలచినప్పుడే శాంతి కలుగుతుంది. ఇది పూర్ణమైన

యోగారూఢస్థితి. 'యోగారూఢస్యతస్యైవ శమః కారణముచ్యతే' అని గీతా 111-3లో చెప్పినట్లు, శమము లేక శాంతి, యోగారూఢులకే కలుగుతుంది. సమస్త లోకాత్మకమైన విశ్వానికి అధిష్ఠానమై, సాత్త్వికమైన యజ్ఞ దాన తపః కర్మలను అనుగ్రహరూపంగా గ్రహిస్తూ సమస్త ప్రాణికోటినీ సమభావంతో పాలిస్తూ లీలావిలాసంతో, "రసోవైసః" గా వుండే భగవత్ చైతన్యమును అనుభవించే స్థితియే శాంతి అని గీత V-29 శ్లోకం తెలియజేస్తుంది. మాస్టరుగారికి యోగ పూర్ణ స్థితి 1961 నాటికే సిద్ధించినది. జన్మాంతరంలో పూర్ణ స్థితి పొందని యోగియైన మాస్టరుగారు వైదిక సాంప్రదాయములోని, వేదవిదుల గృహంలో జన్మించి యోగపూర్ణత్వాన్ని పొందారు.

వారి అన్వేషణలో వారి మనస్సు ఆలోచనాపరంపరల తర్కవితర్కాలను దాటి, అంతశ్చైతన్యపు లోతులలోనికి చొచ్చుకొనిపోయి కొన్ని అతీంద్రియ శక్తులను వారికి కల్గచేసినవి. వారి అంతః ప్రజ్ఞలో వివేక వైరాగ్యములు మేలుకొన్నవి. అంతఃకరణం పరిశుద్ధమై శాంతి శిఖరం పైన నిలచిపోయింది. వారిని కలిసే వ్యక్తుల యొక్క మనోభావాలు, వారి జీవిత విశేషాలు సులభంగా వారికి తెలిసిపోతుండేవి. జ్ఞానానంద స్థితి కలిగింది. ఇంటటి ప్రాతిపదికలో 1963వ సం॥రం ఫిబ్రవరిలో వారి రెండవ అన్నగారితో శిరిడీ దర్శించారు. అక్కడ సమాధి మందిరంలో వారు పొందిన అనుభూతిని సాయి లీలామృతంలో 'పరిచయం' అనే అధ్యాయం క్రింద ఈ విధంగా పొందుపరిచారు. "నా దృష్టి సాయి విగ్రహం మీద పడింది. ఆ స్థితిలో సాయి దృష్టి అంతర్ముఖమై ఏదో అతీతమైన స్థితిలో వున్నట్లు తోచింది. ఆ స్థితిలో ఆయనకు తన నుండి వేరుగా ఈ సృష్టి వున్నట్లు తోచి వుండదని, విశ్వమంతా ఏ మహత్తర చైతన్యంలో సంకల్ప మాత్రంగా వున్నదో దానితో ఆయన తాదాత్మ్యం చెంది వున్నారనిపించింది. అది కేవలం భావంగాకాక ఒక అనిర్వచనీయమైన అనుభవంగా నా హృదయాన్ని కదిలించింది. నా చుట్టూ, నా లోపలా ఏమి జరుగుతున్నదో తెలియలేదు. అలా ఎంతసేపు గడిచిందో తెలియలేదు. కొంతసేపటికి ఉలిక్కిపడి లేచాను. మా అన్నగారు వీపు తట్టి భోజనానికి రమ్మంటున్నారు. ఆ స్థితిలో నుండి మేల్కొనడమెంతో బాధనిపించింది. టైమ్ చూస్తే నేను అక్కడికి వచ్చి సుమారు 6 గంటలైంది. అంతసేపూ

నేను నిలబడి విగ్రహాన్ని చూస్తున్నానని అనుకున్నాను. నిజానికి కూర్చుని వున్నాను. కళ్ళు మూతబడి వున్నాయి. భోజనానికి వెళుతూవుండే కలలో నడుస్తున్నట్లు ఉన్నది. గాఢ నిద్రలో లేపితే తిరిగి మనసు నిద్రలోకి జారినట్లు నా మనసు అప్రయత్నంగా విరామమయిపోతున్నది. వస్తువులను గుర్తించాలన్నా, యోచించాలన్నా ఎంతో ప్రయత్నం చేయవలసి వస్తున్నది. ఇల్లు చేరిన తరువాత కొన్ని నెలలు గడచినా ఆ స్థితి అలాగే వుండిపోయింది. గాఢమైన శాంతి, ఆనందాలలో రోజులు, నెలలూ, క్షణాలలో గడిచిపోయేవి. జగత్తంతా చైతన్యమయంగా తోచేది. దానివలన నా ఉద్యోగవిధులు దెబ్బతినకుండా కొన్ని అటుల నేర్చుకొని జరుపుతుండే వాణ్ణి. నా శరీర తత్త్వంలో గూడా ఎంతో మార్పు వచ్చింది. దృఢమైన ఆరోగ్యం కలిగింది. ఎంత తింటే అంత అరిగేది. ఏమి తినకున్నా నీరసమూ, ఆకలీ ఉండేవి కావు. ఎప్పుడు పడుకున్నా గాఢంగా నిద్రపట్టేది. కొన్ని రోజులు నిద్రలేకపోయినా కళ్ళు మంటలు, ఆవలింతలూ వుండేవి కావు. ఎటువంటి ఆధ్యాత్మికమైన ప్రశ్న వచ్చినా త్వరలో సమాధానము స్ఫురించేది. ఎవరినైనా చూడాలనుకుంటే త్వరలో వారే రావడం జరిగేది. ఇతరుల గురించి సామాన్యంగా తెలియడానికి వీలులేని అంశాలు అకస్మాత్తుగా నా మనసులో మెదిలేవి. నా పరిచయస్థులందరూ నా దగ్గర తమకెంతో శాంతిగా వుంటుందనేవారు". వీరి ఆత్మ, పరమాత్మకు ప్రతిరూపమయిన సాయిలో లీనమైనది. వీరి చైతన్య ప్రవంతి విశ్వచైతన్య సముద్రంలో లీనమైంది. ద్రష్టజాతమైన తాను, దృశ్యము జ్ఞేయమైన సాయిగా వున్న పరమాత్మ, ద్రష్ట భావమైన జ్ఞానము అనే త్రిపుటి భావం మీరిపోయి వారి చిత్తం బ్రహ్మంలో లీనమై పోయింది.

ఈ అనుభూతిలో ఉత్తేజితమైన మాస్టరుగారు. "అయ్యో? బాబాను సశరీరంగా చూడలేకపోయినా కనీసం ఇప్పుడున్న పూర్ణ పురుషులనైనా చూస్తే బాగుండు" అని అనుకొని శిరిడీ వెళ్ళినపుడు బాబాను అలాగే ప్రార్థించినారు. ఆయన దయ వలన వారి ప్రార్థన మన్నించబడింది. శ్రీ పాకలపాటి గురువు, రంగన్నబాబు, లాఖాడీబాబా, శ్రీ సత్యసాయి బాబా, శ్రీ ముమ్మిడివరం బాలయోగి, శ్రీ కంచి కామకోటి పీఠాధిపతి, శ్రీ ఆనందమయీ అమ్మ, శ్రీ అఖండానంద

సరస్వతి, చీరాల, కడప, కాళహస్తులలో నివసించిన అవధూతలు, శ్రీ చివటం అమ్మ, శ్రీ అనసూయమాత, శ్రీ పూండిస్వామి, శ్రీ గులాబ్ బాబా, ఇలా ఎందరెందరో మహాత్ముల దర్శన ఆశీస్సులు వారికి అనుగ్రహించబడినవి. వీరందరూ వారి కృపను మాస్టరుగారికి సకల సిద్ధ స్వరూపి అయిన శ్రీ సాయిని స్మరించినంతనే ప్రసాదించినారు.

వీరు దర్శించిన మహాత్ములెందరో వీరిని మహాత్ముడని గుర్తించారు. మాస్టరు గారు నైమిశారణ్యంలో ఆనందమాయిని దర్శించారు. ప్రథమంలో అక్కడ ఆశ్రమము వారు వీరిని అమ్మ దగ్గరకు పోనీయలేదు. అక్కడకు చేరిన మరునాటి ఉదయం దూరంగా భక్తులతో చేరి చలిబాధ తీర్చుకోడానికి ఎండలో కూర్చున్న వీరిని అమ్మ చూచి ఒక భక్తుని ద్వారా తమ చెంతకు పిలిపించుకొని తమ సన్నిధిలో ఏ ఒక్కరికీ కలుగని విశేషమైన వసతిని కలిపించి అక్కడ భక్త బృందానికి వీరి పట్ల శ్రద్ధాభక్తులు కలిగేటట్లు అనుగ్రహించింది. వీరి కోరికపై తమ పునర్దర్శనం కలుగుతుందని చెప్పింది.

అక్కడ ఆధ్యాత్మిక సప్తాహంలో భాగవత ప్రవచనం చేస్తున్న అఖండానంద సరస్వతి, సమాధి చెందని సిద్ధపురుషుడే ఆధ్యాత్మిక జ్ఞానాన్ని ప్రసాదించగలరని చెప్పారు. సమాధి చెందిన సాయిని ఆశ్రయించిన వీరు ఈ శంకను తీర్చమని సాయిని ప్రార్థించారు. ఒక పూర్వ విద్యార్థి ఆహ్వానంపై వీరు పూనా వెళ్ళి అక్కడ 'గుళవణి మహరాజ్' అనే సిద్ధ పురుషుని దర్శించారు. ఆ వృద్ధ మహనీయుడు వీరిని "ఓ సాయి బాబా కా బేటా" (ఓ సాయికుమారా) అని పలుకరించారు. వీరి శంకను విని, 'సాయి సాక్షాత్తు దత్తాత్రేయుని అవతారమని, సమాధి చెందిన తరువాత గూడ ఎందరికో సశరీరంగా దర్శనమిచ్చి ఉద్ధరిస్తున్నారని చెప్పారు. అప్పుడు పూనేలో ఆనందమాయి వున్నారని ధ్యానంలో లోపమేమున్నా వుంటే ఆత్మజ్ఞానియైన ఆమె సన్నిధిలో ఒక గంట ధ్యానం చేసుకొంటే తీరిపోతుందని చెప్పగా మాస్టరుగారు ఆనందమాయి యొక్క పునర్దర్శనం, ఆమె సన్నిధిలో ఒక గంట ధ్యానం చేసుకొనే భాగ్యం పొందారు. వాసుదేవానంద సరస్వతి అనే మహాత్ముడు సంస్కృతంలోనికి అనువదించిన గురుచరిత్రను "సంహితాయన గురుద్విసాహస్రి" అనే గ్రంథాల పారాయణ అనంతరం సాయి వీరికి స్వప్న

దర్శనమిచ్చి వీరిని కౌగిలించుకొని, "గురువు దొరకలేదని బాధ పడతావెందుకు, నేనున్నా" నని ముమ్మారు చెప్పి చింత తీర్చారని మాస్టరుగారు సాయి లీలామృతంలోని 'గురుస్మృతి' అనే అధ్యాయంలో తెలియపరిచారు.

అవధూత చామిరెడ్డి తాతగారు గుంటూరు వచ్చినప్పుడు ఒంగోలుకు వచ్చి మాస్టరుగారి యింటిలో కొద్ది గంటలుండి తరువాత గొలగమూడి వెళ్ళారు. దత్తస్వామి ఎక్కడ వున్నారని మార్గంలో ఒకరు అడిగినప్పుడు మనం ఇప్పుడు కూర్చొని వచ్చిన ఇంట్లో వున్నారని అవధూత చెప్పారు. అట్లనే మాయీ అమ్మను కన్యాకుమారి నుండి గుంటూరుకు తీసుకొని వెళుతున్న వ్యాన్ మాస్టరుగారి యింటిముందు ఆగింది. వ్యాన్‌లోనే ఫలహారం, ఆరతి, నైవేద్యం అయిన తరువాత అమ్మ బహిర్దేశానికన్నా వంకతో వ్యాన్ దిగి మాస్టారి ఇంటి వరండాలో సుమారు ఒక గంట కూర్చొని వెళ్ళారు. ఈ ఇద్దరు మహాత్ములూ మాస్టరు గారిని మహాత్ములని గుర్తించి వారి సన్నిధిలో కొంతసేపు గడిపారు.

శ్రీ సాయిని నిత్యసాక్షాత్కారం కలిగిన రంగన్న బాబుగారు గుంటూరు వదలి ఎక్కడకూ వెళ్ళేవారు కారు. మాస్టరుగారి ఆహ్వానం పై విద్యానగర్ వెళ్ళి రెండు రోజులుండి అందరినీ ఆశీర్వదించి, అక్కడ ఒకస్థలం చూపి అందులో ఒక సాయి మందిరం వెలుస్తుందన్నారు. ఆ విధంగానే సాయి మందిరం అక్కడ నిర్మించబడ్డది. 1975లో మాస్టరుగారు వివాహితులైనాక వారి తల్లి ఆబ్దీకం చేసుకో బోతూ భోక్తలుగా మహనీయులెవరైనా రావాలని ముందురోజు రాత్రి బాబాను ప్రార్థించారు. తెల్లవారుఝామునే రంగన్నబాబుగారు వారింటికి వచ్చి భోక్తగా నిలిచారు. నాలాయలో యజ్ఞం చేస్తున్న సమర్థ నారాయణ మహరాజుగారు మాస్టరుగారు సమర్పించిన భిక్షను స్వీకరించారు.

విద్యానగరంలోని సాయిమందిర నిర్మాణానికి పూర్ణానందస్వామి వారి ఆశీస్సులు కోరినప్పుడు "శ్రీ సాయిని ప్రతి శ్వాసలోను తలపులోనూ నింపుకొన్న మాస్టరు గారి హృదయంలో కలిగిన సాయి మందిర నిర్మాణ సంకల్పం విశ్వశక్తినే ప్రేరేపించగలదు. అంతటి దివ్యమైన కార్యానికి ఎంతటివారి ఆశీస్సులైనా కోరనవసరం లేదు. అది విధిగా సఫలమవుతుంది" అని తెలియపరచారు. సాయి మందిరానికి శంఖుస్థాపన చేయమని రంగన్నబాబు గారిని. విద్యానగర్‌కి వచ్చిన

పూర్ణానందస్వామిని కోరితే వారు ఆ కార్యం నీవే చెయ్యవలెనని మాస్టర్‌గారితో అన్నారు. వీరిద్దరూ ఈ విధంగా మాస్టరుగారిని మహాత్ములుగా ప్రకటించారు.

విశాఖపట్నం దగ్గర చింతపల్లి అడవులలో ఆశ్రమం ఏర్పాటు చేసుకొని సుమారు 60 సంవత్సరాలకు పైన అక్కడే నివసిస్తూ అక్కడి ఆటవిక ప్రజలకు సుమారు 300 గ్రామాలు ఏర్పాటు చేసి వాళ్లను సహజమైన జీవితంలో ఉన్నత మానవ జీవితాన్ని గడిపే వాళ్లనుగా తీర్చి ఉత్తమ స్థాయికి తెచ్చిన సిద్ధపురుషుడుగా ప్రఖ్యాతిగాంచినవారు పాకలపాటి గురువుగారు. వారిని మాస్టరుగారు 1966 లో ప్రథమంగా దర్శించి వారి చేత ఆత్మజ్ఞానిగా గుర్తించబడి వారికి ప్రీతి పాత్రులయ్యారు. తరువాత 1970లో పాకలపాటి గురువుగారు తమ స్వప్నంలో మాస్టర్‌గారు శంఖచక్రాలతో, నామాలతో చతుర్భుజాలతో కనిపించారని వారిని తొందరగా చూడాలని మాస్టర్‌గారి నాన్నకు, పెద్దన్నగారికి తెలియపరచి. తమ దగ్గరకు మాస్టర్‌గారికి వెంటనే జాబు వ్రాసి రప్పించమని చెప్పారు. మాస్టర్ గారి తండ్రి ఆ విధంగానే జాబు వ్రాసి వారి ఆతురతను తెలియపరిచారు. మాస్టర్ గారు ఆ స్వప్నం యొక్క సందేశాన్ని అర్థం చేసుకొని త్వరలో వారు దేహత్యాగం చేయబోతున్నారని తెలుసుకొని వారిని 1970 జనవరిలో దర్శించి వారిదేహ త్యాగానికి ముందే రహస్యమైన సందేశాన్ని అందుకున్నారు.

ఇక్కడ ఆత్మనిష్ఠులైన మాస్టర్‌గారు, ఆత్మ నిష్ఠులైన పాకలపాటి గురువుగారి స్వప్నమును ఆ స్వప్న స్థితి ఏమిటో బాగుగా ఎరిగినారు. మహాత్ములకు గూడ నిద్ర. స్వప్నమూ వుంటాయని రమణ మహర్షి 1940లో ఒక భక్తుని ప్రశ్నకు సమాధాన మిచ్చారు. జ్ఞానోదయమైన తరువాత వ్యక్తిత్వముండదు. వారి మనస్సు ఆత్మజ్ఞాన నిష్ఠలోనే వుంటుంది. అక్కల్‌కోట స్వామి సమర్థులు గూడ గుఱ్ఱు పెట్టి నిద్రించారు. గోవిందరావనే భక్తుడు పరిపూర్ణులైన మహాత్మునికి నిద్ర లేదని శాస్త్రం చెబుతుంటే అని స్వామిని శంకించినప్పుడు. స్వామి వెంటనే కండ్లు తెరచి అటువంటిదేమీ లేదని అతనికి చెప్తూ వెంటనే గురకపెట్టి నిద్ర పోయారు. ఆత్మజ్ఞానికి వ్యక్తిత్వముండదు. వారు పూర్వ ప్రజ్ఞలు ఆత్మనిష్ఠులైన మాస్టర్‌గారు ఆత్మనిష్ఠులైన పాకలపాటి గురువుగారు తమ స్వప్నసందేశం ద్వారా తాము దేహం త్వరలో విడవబోతున్నారని తెలియపరుస్తున్నారని వెంటనే వెళ్ళి

వారి సందేశాన్ని అందుకొంటూ వచ్చారు. 1970 ఫిబ్రవరిలో శివరాత్రినాడు పాకలపాటి గురువుగారు దేహం త్యజించారు. పాకలపాటి గురువుగారి శిష్య వృత్తాన్ని ఆత్మ నిష్ఠులైన మాస్టర్‌గారు తెలుసుకోగలిగారు.

మాస్టర్‌గారు ఆత్మనిష్ఠులైన మహాత్ములెందరినో దర్శించి వారిచేత వీరు ఆత్మ నిష్ఠులైన జ్ఞానిగా గుర్తించబడ్డారు. మహాత్ములతో వీరికి కలిగిన సన్నిహిత విశేషాలు వీరు వ్రాసిన గ్రంథాల ద్వారానూ, మదే సంచరీమం అనే పావనీయ లోకూ పొందుపరచబడినవి. ఆత్మజ్ఞానులైన వీరు సహజ సమాధి స్థితిని అనుభవిస్తూ సమాజ శ్రేయస్సును ఆకాంక్షించి ఎన్నో ఉత్తమ గ్రంథాలను రచించారు. విశేషంగా పర్యటించి, సత్సంగాలు జరిపి, ప్రజలలో ఉత్తమ సంస్కృతిని జాగృత పరచి వారి ద్వారా తమ సన్నిధి భాగ్యం లేనివారికి గూడ చక్కని సందేశం అందించారు. అంతేగాక ఒక "సాయిబాబా" పత్రిక ద్వారా మహాత్ముల జీవిత విశేషాలు, ఆధ్యాత్మిక వైజ్ఞానిక విశేషాలు, ధార్మిక విశేషాలూ పరిప్రశ్నలు - వాటికి సమాధానాలు, చక్కని జీవన విధానం ఇట్లా ఎన్నో విశేషాలు ఉండేటట్లు చేశారు

నిరంతరం వైజ్ఞానిక గ్రంథాలను చదివి వైజ్ఞానిక విషయముల ద్వారా సమన్వయింపబడిన ఆధ్యాత్మిక దర్శనాన్ని ప్రజలకందివ్వడానికి 'విజ్ఞాన వీథిలో' అనే అత్యుత్తమ గ్రంథాన్ని రచించారు. ఈ శతాబ్దానికే మకుటాయమానమైన గ్రంథమని పెద్దలు కీర్తించారు. వీరు వ్రాసిన సాయిలీలామృతం దైవతత్త్వాన్ని, గురుతత్త్వాన్ని, దేవతత్త్వాన్ని, ఆధ్యాత్మిక జ్ఞానాన్ని, ధర్మ విశిష్టతను చక్కగా వివరించేది మాత్రమే గాక పారాయణ గ్రంథంగా రూపొందిద్దుకొని, పాఠకుల నెందరినో చక్కని జీవిత పథంలో నడిపిస్తూ సద్గురు కృపకు పాత్రులను చేసి, వారిని, సమాజానికి శ్రేయస్సు చేకూర్చేదిగా వున్నదని యెందరి ప్రశంసలనో అందుకొన్నది. ఈ గ్రంథం యొక్క ఆంగ్లానువాదమైన "సాయిబాబా ద మాస్టర్" ను చదివిన విదేశీయుడు (అమెరికాలోని సియాటిల్‌కు చెందిన ప్రముఖ క్రైస్తవ పండితుడు) హాలోరిఫ్స్ మాస్టర్ గారికి వ్రాసినది "మీరు మాకోసం, మానవ జాతి కోసం చేస్తున్న కార్యక్రమం ఊహింపను మించినదిగా ఎరుగని మహాపురుషు లైన సాయిబాబాను గురించి చెప్పడం ఈ కార్యక్రమాన్ని ఎలా వర్ణించాలో

తెలియడం లేదు. ఏమంటే ఒక సమగ్రమైన జీవిత వైఖరిని తెలుపుతున్నారేమో! మీ సాయిబాబా ది మాస్టర్ చదువుతుంటే జీవన్ ముక్తుల్ని అర్థం చేసుకోవడం ఎంత తేలికో కనుపిస్తుంది. ఈ కారణంగా మీ గ్రంథం కోటానుకోట్ల చేతులలో వుండి తీరుతుంది" అని వ్రాశారు. "మీ కృషి యావత్ ప్రపంచానికే వెలలేని కానుక. నేటి మానవాళికి అత్యావశ్యకము, సమగ్రము విశ్వదృష్టిని సాయినాథుడు ఈ లోకానికి అందించారని, అది మీ గ్రంథాలలోనే లభిస్తుందని" పాల్‌రెప్స్ అన్నాడు. "వాటి కోసం వేయి కళ్ళతో ఎదురు చూస్తుంటాము" అని కెనడాకు చెందిన 'హెర్బ్ మెకన్నాన్' అన్నారు. ముముక్షువులకు, సాధకులకు గురువై అన్ని మార్గాలు బోధించగలిగేవి అవి. విశ్వమంతా తమ రూపమే అని భక్తులకు అనుభవ పూర్వకముగా నిరూపించిన సాయితత్త్వాన్ని, సత్య స్వరూపమైన పరమాత్మతత్త్వాన్ని బోధిస్తుంది ఈ గ్రంథం. మాస్టరుగారి చేతనే వ్రాయబడ్డ సాయినాథ ప్రబోధామృతం, విజ్ఞాన వీచికలు దర్శన గ్రంథాలుగా కీర్తించబడి ఆధ్యాత్మిక మార్గంలో పయనించే సజ్జనులను తరతరాలుగా నడిపించే కరదీపికలుగా కీర్తించబడుచున్నవి. భారతదేశంలో వెలసిన సద్గ్రంథముల ప్రక్కన చేర్చ దగిన సప్తమ దర్శనంగా విరాజిల్లుతుందని దేశ విదేశ ప్రజలు మన్ననలు చాటుచున్నవి.

వీరు మహా గ్రంథకర్త, మానవుడుగా మహోన్నత మానవతా లక్షణములతో ప్రకాశించుచున్న ధర్మబద్ధమైన జీవితం గడుపుకుంటూ జ్ఞానవైరాగ్య వివేకము లతో విరాజిల్లుతూ, చిన్న, పెద్ద, సంపన్నుడు, దరిద్రుడు, విద్యావంతుడు, విద్యా విహీనుడు, అధికారి, అనధికారి అనే భేదంలేకుండా తమ చెంతకు వచ్చిన వారందరికీ అందుబాటులో వుండి వారి సమస్యలను తీరుస్తూ, వారి ప్రశ్నలకు సమాధానమిస్తూ, శాంతిచేకూరుస్తూ ఉండేవారు. వారి సన్నిధే శాంతి చప్పరం, ఆధ్యాత్మిక అనుభూతితో నిండిన వారి అంతరంగం ప్రగాఢ శాంతితో గూడిన సహజ సమాధిలో స్థిరంగా నిలిచియున్నదని, నిర్మలము, విశాలమూ అయిన చూపుతో వెలుగుచున్న వారి నేత్రప్రకాశం తెలుపుతుంది.

వారి ఉద్గ్రంథాలు, పరిపృచ్ఛలకు వారు వ్రాసిన సమాధానాలు, వారి గోష్ఠి ప్రవచనములు, ఉపన్యాసములు, వ్యక్తిగత అంతరంగిక విషయాలు తెలుసుకోవ సమే గాక, పాఠంపాటి 'గురువుగారు పెద్ద పురుషులవ వచ్చిన వ్యక్తిత్వవిశేషమైన

దివ్య స్వప్న సంకేతం కోసం వాస్తవిక సూచనలను తెలుసుకొన్న మాస్టరుగారు ఋతంభర ప్రజ్ఞులు, ప్రజ్ఞాన ఘనులు.

పూర్ణబ్రహ్మావతారము, సాయి మరోరూపమూ అయిన అక్కల్కోటస్వామి సమర్థులు చోళప్ప కుటుంబం వారికి స్వప్న సందేశం ద్వారా వారి ఇంటిలోనున్న తమ వర్మ పాదుకలను ఒంగోలులో వున్న భరద్వాజ మాస్టర్ గారి దగ్గరకు తీసుకుపొమ్మని తెలిపారు. స్వామి పాదుకలు మాస్టర్ గారింటికి వారి నిర్యాణమునకు ముందు రోజు వచ్చినవి. ఆ పాదుకలను మాస్టరుగారు సేవించుకొని మరునాడు అనగా 12-4-89 ఉదయం వాటిని మందిరానికి తీసుకు పొండి. భక్తులందరూ సేవించుకొంటారని పాదుకలు తెచ్చిన వారికి చెప్పి వారిని కొంత దూరం సాగనంపి వారు తిరిగి వెళ్ళారు. పాదుకలు మందిరానికి చేరినవి. మాస్టరుగారు నిర్యాణం చెందారనే వార్త కూడా వెంటనే మందిరానికి చేరింది. ఈ విషయం మొన్న సెప్టెంబరు మాసంలో శిరిడీ యాత్రకు టూరిస్టు బస్సులో వెళ్ళిన మాకు అక్కల్కోటలో చోళప్ప కుటుంబం వారు బసచేసిన గుడిలో మాకు చెప్పి మాస్టర్ గారిని మా స్మృతికి తెచ్చి మా నేత్రాలను ఆర్ద్ర పరిచారు. స్వామి సమర్థులు మాస్టరుగారు నిర్యాణము చెందబోతున్నారని, వారికి తమ అనుగ్రహసూచకంగా పాదుకలను వారి దగ్గరకు పంపించారు. ఈ విధంగా మాస్టర్ గారు మహాత్ములని సాయి మరో రూపమైన స్వామి ప్రకటించారు.

అట్టి మహాత్ములైన మాస్టర్ గారి జ్ఞానతరంగంలో ఉద్భవించిన మరొక కమలం ఈ 'తాజుద్దీన్ బాబా జీవిత చరిత్ర' సంసార తాపతప్తులైన లౌకిక పాఠకుల హృదయాలను ఈ గ్రంథం ఆర్ద్రపరచి సేద తీరుస్తుందని, భక్తుల హృదయాలు మహాత్ముల లీలాసౌరభము గుబాళింపుతో పులకించగలవనే భావనతో ఈ గ్రంథ సుమమునందించిన మాస్టర్ గారికి ప్రణామాలర్పిస్తున్నాను

– తంగెళ్ళ వెంకట సుబ్బయ్య

# శ్రీ హజరత్ తాజుద్దీన్ బాబా దివ్య చరిత్ర

## అధ్యాయము - 1

## జననము - బాల్యము - సంపూర్ణత్వము

తాజుద్దీన్ బాబా పూర్వీకులు అరబ్బుదేశపు వారు. హజరత్ ఇమామ్ హసన్ అనే ఆయన వంశస్థుడైన సయ్యద్ అబ్దుల్లా అరేబియా దేశం నుండి హిందూ దేశానికి వచ్చి మద్రాసులో స్థిరపడ్డారు. చాలాకాలంగా ఆయన సంతతి వారంతా మద్రాసు పరిసర ప్రాంతంలోనే నివసిస్తూ వస్తున్నారు. ఆ సంతతిలోని వారిలోనివాడే సయ్యద్ బద్రుద్దీన్. సయ్యద్ బద్రుద్దీన్ సైన్యములో చేరి మద్రాస్ ప్లటూన్ 32లో సుబేదారుగా వుంటూ 'కాంప్టీ' అనే వూళ్ళో వుంటూ వుండేవాడు. అతను షేక్ మీరాన్‌సాహెబ్ కూతురైన మీరాబీని వివాహం చేసుకొన్నాడు.

1861 సంవత్సరము జనవరి 27వ తేదీన గురువారం ఉదయం గం.5-15 నిం.లకు కాంప్టీలో బద్రుద్దీన్‌కు కొడుకు పుట్టాడు. ఆ పిల్లవాడికి తాజుద్దీన్ అని పేరు పెట్టారు. అయితే తాజుద్దీన్ అందరిపిల్లల వలె పుట్టగానే ఏడవలేదు. తల్లిదండ్రులు శిశువులో జీవం వుందో లేదోనని అనుమానించి గాబరా పడ్డారు. అందుచేత వారి ఆచారం ప్రకారం శిశువు కణత పైన ముఖం మీద కాల్చారు. అప్పుడా శిశువు తాను జీవించే వున్నానని తెల్పడానికేమోనన్నట్లు కొద్ది క్షణాలు మాత్రమే రోదించి వూరుకొని అన్ని వైపులకు చూడడమారంభించాడు. మహాత్ముడైన తాజుద్దీన్ ముఖం మీద ఆనాడు కాల్చిన ముద్రలు శాశ్వతంగా వుండిపోయాయి.

తాజుద్దీన్ తల్లిదండ్రులకు ఆయనను "బాబా తాజుద్దీన్" గా చూచే అదృష్టం లేకపోయింది. తాజుద్దీన్ పుట్టిన సంవత్సరానికే అతని తండ్రి బద్రుద్దీన్ చనిపోయాడు. ఆయనకు 9వ సంవత్సరం రాగానే తల్లి కూడా గతించింది. తండ్రి చనిపోయిన తరువాత తాజుద్దీన్ వాళ్ళ అమ్మమ్మగారి యింటి వద్దనే పెరిగాడు. అతనిని 6వ యేట స్కూల్లో చేర్పించారు. 6వ సంవత్సరం నుండి 18వ సంవత్సరం దాకా తాజుద్దీన్ అరబ్బీ, పార్శీ, ఇంగ్లీషు భాషలు నేర్చుకున్నాడు.

ఆశీర్వాదం ,

తాజుద్దీన్ 6వ సంవత్సరంలో ఒకసారి స్కూల్లో వుండగా ఆ వూళ్ళో ప్రఖ్యాతి గాంచిన ముస్లిం మహాత్ముడైన హజరత్ అబ్దుల్లా షా తాజుద్దీన్ ను చూడడానికి వచ్చాడు. ఆ మహాత్ముడు తాజుద్దీన్‌వైపు దృష్టి సారించి చూచి, పండు లోంచి కొంత ఫలాన్ని తీసి కొంచెం చప్పరించి తాజుద్దీన్ నోట్లో వేశారు. తరువాత ప్రక్కనే వున్న ఉపాధ్యాయునితో ఆయన "ఇతనికి ఏమి బోధించగలరు? క్రిందటి జన్మలలోనే యితను నేర్చుకోవలసినవన్నీ నేర్చుకొన్నాడు" అని తాజుద్దీన్‌తో "మితంగా తిను, మితంగా నిద్రపో మితంగా మాట్లాడు. ఖురాన్ చదివేటప్పుడు మహమ్మదులవారే నీలోవుండి చదువుతున్నట్లు భావించుకో!" అని చెప్పి వెళ్ళారు.

ఈ అసామాన్యమైన సంఘటన తాజుద్దీన్‌లో అద్భుతమైన మార్పు తెచ్చింది. మూడు రోజుల పాటు అతని కళ్ళవెంట సంతత ధారగా నీళ్ళు కారసాగాయి. అప్పటి నుంచి తాజుద్దీన్‌కు ఆటపాటల యందు విముఖత కలిగింది. ఆయన ఒంటరిగా కూర్చొని గొప్ప సూఫీ మహాత్ములు రచించిన గ్రంథాలను చదువుతూ క్రమంగా అద్భుతమైన వారి నవీన విధానాలవైపు ఆకర్షితుడైనాడు.

అతను చదివిన వాటన్నిటిలోకి ఒక మహాత్ముడు రచించిన ద్విపద తాజుద్దీన్ హృదయాన్ని పూర్తిగా ఆక్రమించింది. అదేమిటంటే, "సారాయి త్రాగు. ఖురాను కాగితాలను తగులబెట్టు, కావాలంటే దేవాలయంలో నివసించు. కాని ఏ మానవుని మనస్సునూ గాయపరచకు!" హజరత్ అక్బర్ షా గొప్ప ముస్లిం మహాత్ముడు. పైన చెప్పిన ద్విపద సాహిత్యపరమైన అర్థంతో ఆ మహాత్ముడు చెప్పాడనటం పరిహాసాస్పదమనిపిస్తుంది. సూఫీ మహాత్ములు వ్రాసే అటువంటి ద్విపదలు భావగర్భితమైన భాషలో వుంటాయి. ఆ పదాలలో పైకి ప్రకటమయ్యే అర్థమే గాక లోతైన ఆధ్యాత్మిక సత్యాలు యిమిడి వుంటాయి. సామాన్యంగా వారు ఆధ్యాత్మిక అనుభవాలను గురించి చెప్పేటప్పుడు త్రాగుడు, ప్రేమ, మైకం లాంటి పదాలు వాడుతూ ఉంటారు. అలాగే తాజుద్దీన్‌ను ఆకర్షించిన ద్విపదలో "సారాయి త్రాగు" అంటే భక్తి పారవశ్యం చెందటం. అలాగే "ఖురాన్" అంటే కాగితాల మీద ముద్రించబడ్డ సిరా కాదు. పవిత్రమైన కాబా అంటే నల్లని రాయి మాత్రం కాదు. దేవాలయంలో నివసించు అంటే "ఎవరి నమ్మకాలనూ ఆచారాలను

వారిని వర్తించుకోనివ్వడు" అని భావం. అందుకే ఆయన సిద్ధపురుషుడిగా ప్రఖ్యాతి గాంచిన తరువాత హిందువులను, ముస్లింలను కూడా సమానంగా గౌరవించేవారు. అన్నిటికంటే ఉత్తమమైనదర్మం - ఇతరుల శరీరాలను గాని హృదయ గత భావాలను గాని దెబ్బ తీయకుండటం. తాజుద్దీన్ బాబా జీవిత చరిత్ర అంతా యీ సత్యాలను గూర్చిన మౌనవ్యాఖ్య.

## సైన్యంలో ఉద్యోగం :

తాజుద్దీన్ 18వ ఏట కాంప్టీ దగ్గరగా వున్న కన్హాన్ అనే నదికి తీవ్రమైన వరదలు వచ్చాయి. ఆ వరదలకు తట్టుకోలేక తాజుద్దీన్ మామగారిల్లు కూలి పోయింది. వరద బాధితుల కష్టాలు చూచి తాజుద్దీన్ హృదయం చలించింది. వరద వలన కలిగిన అపార నష్టం వలన తాజుద్దీన్ మామగారైన హజరత్ అబ్దుల్ రహమాన్ అటవీశాఖా కార్యాలయంలో యిల్లు గడవడం కోసం పని చేయవలసి వచ్చింది. ఆయన తాజుద్దీన్‌ను సైన్యంలో చేరమని సలహా యిచ్చారు. తాజుద్దీన్ తన 20వ యేట 1881 వ సంవత్సరంలో 13వ నాగపూర్ రెజిమెంట్ లో చేరాడు. సైన్యంలో వుండగా తాజుద్దీన్ ఉద్యోగ నిర్వహణలో దేశం నలుమూలలా తిరిగాడు. ఫ్రాన్సు మొదలయిన విదేశాలలో గూడ ఆయన పర్యటించారు. విదేశాల నుండి వచ్చాక వారి రెజిమెంట్ హైదరాబాద్‌లో గ్రాస్ ఫారం అనే చోట స్థావరం ఏర్పరచుకున్నారు. అక్కడ వున్న లంత్ అనే అమెరికన్ ఫకీరు తాజుద్దీన్‌తో పరిచయం ఏర్పరచుకున్నాడు. ఆయన తాజుద్దీన్ దగ్గర ఖురాన్ అంతా నేర్చుకున్నాడు. విలియం అనే ఆయన కూడా తాజుద్దీన్‌కు సన్నిహితుడై ఆధ్యాత్మికంగా పురోగమించారు. తరువాత విలియం కలకత్తా వెళ్ళిపోయాడు. టంగ్‌మెరి అనే చోట నేటికీ ఆయన సమాధి చూడవచ్చు.

1884వ సంవత్సరంలో తాజుద్దీన్ వాళ్ళ సైనికదళం సాగర్ అనే చోటుకు చేరింది. సైన్యంలో పనిచేసే రోజుల్లో తాజుద్దీన్ నమాజ్ చేయడంలో ఎన్నడూ అశ్రద్ధ చూపలేదు. సాగర్‌లో వుండేటప్పుడు ఒకరోజున తాజుద్దీన్‌కు అద్భుతమైన కంఠధ్వని వినిపించింది. ఆ శబ్దానికి ఆకర్షితుడై ఆయన అది ఎటునుండి వస్తుందో ఆ దిక్కుగా పోతూ ఊరి బయట హజరత్ దావూద్ షా అనే ముస్లిం మహాత్ముని నివాసం దగ్గరకు చేరాడు. అప్పటి నుండి తాజుద్దీన్ రోజూ వెళ్ళి ఆ మహాత్ముని

సేవించుకోలేవాడు. ప్రతిరోజూ తన ఉద్యోగ ధర్మం ముగిశాక, తాజుద్దీన్ ఆ మహాత్ముని దగ్గర కూర్చొని వీలైనంత ఎక్కువ సేపు ధ్యానంలో గడిపేవాడు. ఒక్కొక్కప్పుడు రాత్రులు గూడ ఆయనతోనే ఉండేవాడు. కాంప్టీలో వుండే తాజుద్దీన్ బామ్మగారు తాజుద్దీన్ రాత్రులు సైనిక గుడారంలో వుండడం లేదని తెలిసి ఆయన ఏదో దుస్సాంగత్యానికి లోనైనాడని తలచి నాగపూర్ వచ్చింది. ఒకరోజు రాత్రి రహస్యంగా తాజుద్దీన్‌ను వెంబడించి ఆయన ముస్లిం మహాత్ముని దగ్గర కూర్చొని ధ్యానం చేసుకుంటూ వుండడం చూసింది. మరునాడు ఉదయమే తాజుద్దీన్ ఇంటికి రాగానే ఆమె ఆయనకు ఫలహారం పెట్టింది. కాని తాజుద్దీన్ వాటిని తినక, "నా దగ్గర లడ్డూ, జిలేబీ, ఉన్నాయి. నేను వాటినే తింటాను" అంటూ ఆయన చేతిలో ఉన్న రెండు రాళ్ళను చప్పరించసాగాడు. తాజుద్దీన్ చేసిన యీ పని బామ్మగారిని ఆశ్చర్యంలో ముంచింది. తాజుద్దీన్ దైవచింతనలో కాలం గడుపుతూ వుండడం వల్ల ఆయనలో గొప్ప ఆధ్యాత్మిక శక్తులు మేల్కొన్నాయని ఆమె గుర్తించింది. తాజుద్దీన్ ఏ దుస్సాంగత్యానికీ లోను కాలేదని సంతోషిస్తూ ఆమె తిరిగి కాంప్టీకి వెళ్ళిపోయింది. దావూద్ చిస్తీ గారు మరణించాక గూడ తాజుద్దీన్ ఆయన సమాధి దగ్గర కూర్చొని ఆధ్యాత్మిక సాధనలు కొనసాగించారు. హజరత్ దావూద్‌తో కలవడం తాజుద్దీన్ జీవితంలో ముఖ్యమైన మరొక సంఘటనగా చెప్పుకోవచ్చు. ఆయన ఆధ్యాత్మిక సాధన రోజురోజుకు తీవ్రమయ్యేసరికి సైన్యములో ఉద్యోగం ఆయనకు పెద్ద అవరోధంగా తయారయింది. ఆయన తన ఉద్యోగానికి రాజీనామా చేస్తున్నట్లు సైన్యాధిపతికి వ్రాసుకున్నాడు. చక్కని ఉద్యోగాన్ని వదులుకుంటున్నందుకు ఆశ్చర్యంతో తాజుద్దీన్ బంధువులకు యీ విషయం తెలియచేశాడు ఆ కమాండరు. తాజుద్దీన్‌కు మతి ఏమన్నా భ్రమించిందేమోనని భయపడుతూ బామ్మగారు నాగపూర్ వచ్చి మనుమణ్ణి చూసింది. అప్పటికే తాజుద్దీన్ పూర్తిగా మారిపోయారు. ఏదో అతీతమైన వస్తువు కోసం పరితపిస్తూ ఆయన శారీరక అవసరాలను, ప్రాపంచిక బాధ్యతలను పూర్తిగా విస్మరించి తిరుగసాగారు. ఇప్పటి తాజుద్దీన్ ఇదివరకు చూసిన తాజుద్దీన్ కాదు. ఆమె వెంటనే మనుమణ్ణి తనతో పాటు కాంప్టీ తీసుకువెళ్ళింది. ఆయనను మామూలు ప్రపంచంలో పడవేయడానికి ఎన్నో చికిత్సలు చేయించింది. ఆయన పిచ్చిని తగ్గించడానికి వైద్యులు, మంత్రవేత్తలు ఇంద్రజాలకులు ప్రయత్నించి

నిమ్మళించియున్నారు. ఆయనకు పిచ్చి అనుకోవడం వారి పిచ్చి. అంతేగాని దైవ స్థితి. గురువుయొక్క ఆశీర్వాదం వల్ల తాజుద్దీన్ బాబా తన ఉద్యోగాన్ని మరచిపోయి ఆధ్యాత్మిక స్థితుల్లో ఉన్నతదశయైన అద్వైతస్థితిని అనుభవిస్తున్నారని వారు గుర్తించలేక పోయారు. ఊరి ప్రజలంతా ఆయనొక పిచ్చివాడనే వారు. పిల్లలు చుట్టూ గుంపుగా చేరి రాళ్ళు ఆయన మీదకు విసిరేవారు. ఆయన వారినెన్నడూ ఏమీ చెప్పక చిరునవ్వుతో అంతా సహించేవారు. ఇంకా పైగా పిల్లలు తనను కొట్టడానికోసం తనే రాళ్ళన్నీ ఏరుకొచ్చి కుప్పలు కుప్పలుగా పోసి వుంచేవారు. ఇతరులెవరైనా అది చూచి మందలిస్తే మధ్యలో కల్పించుకున్నందుకు వారిపై కోపగించేవారు.

ఈ స్థితిలో తాజుద్దీన్ బాబా 4 సంవత్సరాలు కాంప్టీలో వున్నారు. ఆ సమయంలోనే ఆయన బామ్మగారు తన మనుమడుగొప్ప వలియా అవుతాడనే సంగతి తెలియకుండానే మరణించారు. అప్పుడు తాజుద్దీన్ మామగారైన రహమాన్ గారు ఆయనను 'ఖాండా'కు తీసుకువెళ్ళారు. అక్కడ కూడ తాజుద్దీన్ కు కొంతకాలం వైద్యము చేయించి ఫలితమేమీ కనిపించకపోయేసరికి ఆయనను తీసుకువచ్చి మళ్ళీ కాంప్టీలో వదిలి వెళ్ళారు. తాజుద్దీన్ సంతపల క్రింద, పాడుబడిన ఇండ్లలో నివసించేవారు. ఆయన ఎండనూ వానను ఎన్నడూ లెక్క చేయలేదు. వానవస్తే ఏదో ఒక చెట్టు క్రింద నుంచొనేవారు. ఏదైనా తినాలని గాని, త్రాగాలని గాని ధ్యాసేలేక ఆయన పూర్తిగా నగ్నంగా సంచరించేవారు. ఎవరైనా ఎప్పుడైనా దయతో ఆయనకేదైనా పెడితే రోడ్డుమీద పోయే ఏకుక్కకో దానిని పెట్టేవారు.

తాజుద్దీన్ ఎడ ప్రతి మనిషీ నిర్లక్ష్యంగా వున్న ఆ సమయంలో దైవ హస్తము ఆయనను ప్రజలలోకి తోసింది. ఆయనలో నుండి అద్భుతమైన మహిమలు ప్రకటమవడం మొదలయ్యేసరికి తాజుద్దీన్ వ్యక్తిత్వం, ఆయన శక్తి ప్రజలకు అర్థమవసాగాయి. తరువాత నుంచి కాంప్టీలో జరిగిన అద్భుత మహిమల గురించి ప్రజలంతా కథలు కథలుగా చెప్పుకోసాగారు. తాజుద్దీన్‌ను లోకమంతా 'తాజుద్దీన్ బాబా' గా వ్యవహరించసాగారు. ఆ లీలలలో కొన్నింటిని మనము కూడా చూద్దాము.

# అధ్యాయము - 2

## అద్భుత మహిమలు

### వింతైన జ్యోతిష్యం

కాంప్టీలో ఒక కుమ్మరి వాని యింటికి తాజుద్దీన్ బాబా ఒకసారి వెళ్ళి ఆతనితో "ఈ ఇల్లు ఖాళీ చెయ్యి నీ వస్తువులన్నింటినీ వీలైనంత త్వరగా బైటకి చేర్చుకో" అన్నారు. బాబా కీర్తిని ఇదివరకే విన్న కుమ్మరి ఆయనపట్ల గౌరవంతో ఆయన చెప్పినట్లే చేశాడు. ఆ రాత్రి ఆ ఇల్లు కూలిపోయింది. ఆ విధంగా ఆ కుమ్మరి వాని కుటుంబం మృత్యువు నుండి రక్షింపబడడంతో వారు కూడ బాబా భక్తులయ్యారు.

ఒకసారి తాజుద్దీన్ బాబా ఒక ఇంటికి వెళ్ళి భిక్ష అడిగారు. ఆ వ్యక్తి, "ఈ సమయంలో ఇంట్లో ఏకాన్నం లేదు బాబా" అన్నాడు. తాజుద్దీన్ బాబా విడవకుండా అతనితో "పెట్టెలో ఆహారముంచుకొని లేదని అబద్ధమాడతావేం ?" అన్నారు. తాజుద్దీన్ బాబా అసామాన్య శక్తుల గురించి అదివరకే విన్నాడు గనుక ఇంట్లోకి వెళ్ళి పెట్టెలో వెతికాడు. ఆశ్చర్యం. ఆ పెట్టెలో ఎవరూ ఇంతకు ముందు దాచకనే అందులో ఆహారపదార్థాలున్నాయి. వాటిని తెచ్చి అతను బాబాకు సమర్పించాడు.

దావానలం ఎంత వేగంగా అన్ని వైపులకూ వ్యాపిస్తుందో అలాగే తాజుద్దీన్ బాబా మహిమల గురించి దేశదేశాలు ప్రాకిపోయింది. ప్రజలు బాబా ఆశీస్సుల కోసమూ ఆయన కృపాదృష్టివల్ల తమ కోరికలు తీరుతాయనే ఆశతోనూ ఆయన చుట్టూ మూగేవారు. ఏ మాత్రం శ్రమ పడకుండా, కాసి ఖర్చు లేకుండా కోరికలు తీరే మార్గం దొరికితే ఆ కోరికలు తీర్చడంలోని వారి దివ్యత్వాన్ని మరుస్తారు. వ్యక్తిగత కక్ష, అసూయ భావనలతో తమ స్థితిని ఆధిక్యత పరచుకోవడానికి ఇతరుల పీడావకాశాలు, విలువలేని విషయాలను కోరడానికి మనిషి దిగజారి యింకా యింకా దుఃఖాన్ని కొని తెచ్చుకుంటారు.

అటువంటి మనస్తత్వంతో ప్రజలు వారిచుట్టూ చేరుతున్నపుడు మహాత్ములు వారి అద్భుతశక్తులను స్వార్థం కోసం అన్వేషించే సాధకులకు, విరక్తులైన వారికి వరకు మాత్రమే పరిమితం చేసుకుంటారు. కాలక్షేపం కోసం వారి దివ్య శక్తులను పరీక్షించ చూస్తుంటే వారిని మహాత్ములుగా లెక్కపెట్టరు. నిజమైన మహాత్ములెప్పుడూ భక్తుల వ్యక్తిగత, మానసిక దృక్పథాల వల్ల అస్పష్టమైన అవగాహన కల్పిస్తుంటారు.

కొంత కాలానికి అర్థరహితమైన కోరికలతో సహాయాల కోసం వేధించే ప్రజల ఎడ్ల తాజుద్దీన్ బాబా విసుగుచెందారు. ఒక రోజాయన, "నేనింక పిచ్చాసుపత్రికి వెళ్తాను" అన్నారు. చెప్పినట్లుగానే ఆయన మరునాడు పిచ్చాసుపత్రికి వెళ్లారు. అయితే ఆయన అక్కడకు వెళ్ళిన పద్ధతి ఎంత గొప్పదిగానూ హాస్య పూరితంగానూ వుంటుంటుంది. సూర్యోదయ సమయాన నగ్నంగా ఆయన ఆంగ్లేయ స్త్రీల టెన్నిస్ క్లబ్ ముందు నుంచున్నారు. ఆయనను చూసిన ఆంగ్లేయ స్త్రీలు అశ్లీలమైన ఆయన ప్రవర్తనకు దిగ్భ్రాంతి చెంది పోలీసులను పిలిచి ఆయనను పిచ్చాసుపత్రికి పంపించమన్నారు. పోలీసువారు తాజుద్దీన్ బాబాను నాగపూర్ పిచ్చాసుపత్రిలో చేర్చారు. ఆ విధంగా చేర్చమని కాంప్టీ కంటోన్మెంటు జిల్లా న్యాయాధికారి 1892 ఆగస్టు 26న ఉత్తర్వు జారీ చేశారు.

తాజుద్దీన్ బాబాను పిచ్చాసుపత్రిలోని ఒక గదిలో పెట్టి తాళము వేసినప్పటికీ ఆయన తరచుగా నాగపూర్ వీధులలో తిరుగుతూ కనబడుతూ ఉండడంతో 'పిచ్చి తాజుద్దీన్'ను మాత్రమే గదిలో బంధించగలరని, మహాత్ముడైన తాజుద్దీన్ బాబాను ఇలా ఎవరూ బంధించి ఉంచలేరని అందరికీ తెలిసిపోయింది. పిచ్చాసుపత్రిలో చేర్చే రోజుకు తాజుద్దీన్ బాబా వయస్సు 32 సంవత్సరాల 7 నెలల 9 రోజులని నమోదు చేయబడింది.

## ఆంగ్లేయ స్త్రీల విస్మయం !

పోలీసులు తాజుద్దీన్ బాబాను పిచ్చాసుపత్రిలో చేర్పించాక కొద్ది రోజులకు ఆయనను ఆ శిక్షపడటానికి కారకులైన ఆంగ్లేయ స్త్రీలు తాజుద్దీన్ బాబా కాంప్టీలో తమ యింటి వైపు వెళ్తుండటం చూశారు. పోలీసులు తమ మాటను లెక్క చేయక తాజుద్దీన్ బాబాపై ఎట్టి చర్యా తీసుకోలేదని తలచి, వారు నేరుగా పిచ్చాసుపత్రికి

వెళ్ళి ఆ పిచ్చి ఫకీరును స్వేచ్ఛగా విడిచిపెట్టినందుకు పోలీసులను నిందించారు. పోలీసులు ఆశ్చర్యపోతూ వారిని తాజుద్దీన్ బాబా వుండే గదికి తీసుకు పోయారు. అందులో బాబా కటకటాల వెనుక హాయిగా కూర్చుని వున్నారు. ఆంగ్లేయ స్త్రీల ఆశ్చర్యానికి అంతులేదు !

తాజుద్దీన్ బాబా అటువంటి అద్భుత శక్తులు ప్రదర్శించిన సంఘటనలు ఇంకా ఎన్నో ఉన్నాయి. ఆ రోజులలో పిచ్చాసుపత్రిలో ముఖ్య డాక్టరుగా అబ్దుల్ మజీద్ వుండేవారు. ఒకనాటి రాత్రి ఆయన హాస్పిటల్‌లో పర్యవేక్షణ చేస్తుండగా తాజుద్దీన్ బాబా ఆసుపత్రి వరండాలో తిరుగుతూ కనిపించారు. వెంటనే డాక్టరు గారు కోపంతో వారి వారి గదులలో వుంచి తాళాలు వేసే వార్డర్ల దగ్గరకు వెళ్ళి తాజుద్దీన్ బాబాను అలా బయట వదిలినందుకు నిందించారు. అతడు డాక్టరును వెంట పెట్టుకొని తాజుద్దీన్ బాబా గదికి తీసుకుపోయి చూపాడు. తాజుద్దీన్ బాబా తాళం వేసి వున్న గదిలో కూర్చొని వుండడం చూచి డాక్టరు గారు ఆయన మామూలు పిచ్చివాడు కాదు అని తెలుసుకున్నాడు. అప్పటి నుండి ఆయన తాజుద్దీన్ బాబాకు డాక్టరుగా మాత్రమే కాక భక్తుడుగా కూడా అయ్యాడు. అతను ఏమి చేసినా బాబా ఆశీస్సులతోనే చేసేవాడు. తరువాత డాక్టరు అబ్దుల్ మజీద్‌కు తాజుద్దీన్ బాబా ఎన్నో నిదర్శనాలు చూపారు.

## పారిపోయిన పిచ్చివాడు !

ఒకరోజు ఆసుపత్రి నుండి ఒక రోగి పారిపోయాడు. ఎంత వెదికినా అతడి జాడ దొరకలేదు. ఆస్పత్రి అధికారి అయిన డాక్టర్ అబ్దుల్ మజీద్ చాలా ఆందోళన గా వున్నారు. ఆ సమయంలో తాజుద్దీన్ బాబా డాక్టరు దగ్గరకు వచ్చి "మరేమీ కంగారు పడవద్దు. నిశ్చింతగా వుండు. రేపు ఉదయానికల్లా రోగి తనంతట తానే తిరిగి వస్తాడు" అని చెప్పారు. మరునాడు ఉదయానికల్లా ఆపిచ్చివాడు ఆసుపత్రి గేటు ముందు కనిపించాడు. వెంటనే కాపలావారు అతనిని పట్టుకున్నారు. తరువాత డాక్టరు మజీద్ అతనిని ఎక్కడికి పోయాడో ఎలా తిరిగి వచ్చాడో అడిగినపుడు ఆ పిచ్చివాడు. తాను ఆసుపత్రి నుండి పారిపోయాక కొంతసేపు అటూ ఇటూ తిరిగి డాక్టర్ మజీద్ ఇంటి వైపు వెళ్తుండగా తాజుద్దీన్

బాబా కనపడి తనను తీసుకొని ఆస్పత్రిగేటు దగ్గర వదిలిపెట్టి పోయారని చెప్పాడు. ఇందులో ఆశ్చర్యకరమైన విషయమేమంటే ఆ వ్యక్తి పారిపోయిన దగ్గర్నుంచి మళ్ళీ తిరిగి వచ్చిందాకా తాజుద్దీన్ బాబా ఆసుపత్రిలోని తన గదిని దాటి ఎక్కడికీ పోలేదు. ఈ అపూర్వమైన సంఘటన డాక్టర్ మలీద్‌కు బాబాపై దృఢమైన భక్తి శ్రద్ధలు కలిగేలా చేసింది.

### మృత్యువు నుండి డాక్టరుకు రక్షణ

తన స్వంత పని మీద బొంబాయి వెళుతూ ఒకసారి డాక్టరు అబ్దుల్ మలీద్ తాజుద్దీన్ బాబాను ఆశీర్వదించమని అడిగారు. బాబా మౌనంగా కూర్చున్నారు. బాబా ఆశీర్వదించకుండా వుండిపోయినా డాక్టరు ఆయన ఉద్దేశాన్ని గ్రహించక మళ్ళీ మళ్ళీ పీడించసాగాడు. చివరకు విసిగిపోయిన తాజుద్దీన్ బాబా ఇలా అన్నారు: "మాట లక్ష్యపెట్టకుండా నువ్వు వెళ్ళేటట్లయితే వెళ్ళు. అయితే ఈ ఆకును మాత్రము నీ వెంటనే వుంచుకో!" అని క్రిందపడి వున్న చిన్న ఆకును తీసి డాక్టరు చేతిలో వుంచారు. డాక్టరు ఆ ఆకును భద్రంగా జేబులో దాచుకుని బొంబాయికి ప్రయాణమయ్యాడు. రైలులో ప్రయాణం చేస్తూ అతడు భూసావళ్ రైల్వేయార్డులో క్రిందకు దిగాడు. అతడు పట్టాలమీద వుండగా హఠాత్తుగా ఒక రైలింజన్ అదే పట్టాలమీద వేగంగా వచ్చింది. అందరూ డాక్టరు ఇంజను క్రింద పడి నలిగిపోయి వుంటాడని, తప్పించుకోవడానికి అక్కడ ఏ మాత్రం అవకాశం లేదనే అనుకున్నారు. కాని సరిగ్గా ఇంజన్ వచ్చి డాక్టరును గుద్దుకోబోయే సమయంలో డాక్టరు స్పృహ కోల్పోయి పట్టాలమీద పడిపోయాడు. ఆశ్చర్యకరంగా ఇంజన్ నిలిచిపోయింది. తాము ఆపకుండానే ఇంజన్ ఎందుకు ఆగిపోయిందా అని డ్రైవరూ, బొగ్గు వేసేవాడూ దిగివచ్చి చూశారు. బ్రేకులు వేయకుండానే ఇంజన్ ఆగిపోవడం, పట్టాల మీద డాక్టర్ మలీద్ పడి వుండడం చూసి ఇంజన్ డ్రైవరూ, మిగతా సిబ్బంది డాక్టరు గొప్ప మహాత్ముడై వుంటాడని తలచారు. ఆయన ప్రదర్శించిన అద్భుత మహిమకు అందరూ ఆయనను కీర్తించసాగారు. ఈ సంఘటనను అప్పుడు స్టేషన్‌లో వున్న జనమంతా చూశారు. డాక్టరు మలీద్ వెంటనే తాను తాజుద్దీన్ బాబా భక్తుడనని, ఆయన తన

ప్రయాణానికి మొదట అంగీకరించలేదని, కాని తన బలవంతం మీద ఆయన ఆశీర్వదిస్తూ ఈ ఆకును వెంట వుంచుకోమన్నారని, ఈ మహిమ అంతా బాబా ప్రసాదించిన ఆకుదేనని తనది కాదనీ అందరకూ చెప్పాడు.

### బొంబాయి సేఠ్ కథ

డాక్టర్ అబీద్ బాబాతో స్వయంగా తనకుగల అనుభవాలేగాక బాబా పిచ్చాసుపత్రిలో వుండగా ఆయన దగ్గరకు వచ్చే అసంఖ్యాక భక్తుల అనుభవాలను చూచాడు.

ఒకసారి బొంబాయి నుండి ఒక పెద్ద సేఠ్ వచ్చాడు. ఆయన తండ్రికి తీవ్రంగా జబ్బు చేసింది. బొంబాయిలో వున్న పెద్ద డాక్టర్లందరూ రోగ నివారణ చేయలేకపోయారు. తన తండ్రి జబ్బు నయం చేయమని ప్రార్థించడం కోసం ఆయన తాజుద్దీన్ బాబా దర్శనార్థం వచ్చాడు. ఆ సేఠ్ తన కథను ఇంకా ఆయనతో చెప్పక ముందే తాజుద్దీన్ బాబా అతనితో, "నువ్వు ఇంటికి వెళ్ళు. నీ తండ్రికి జబ్బు నయమయింది" అన్నారు! అయితే ఆ సేఠ్ ఆ మాటలు నమ్మక, తనను వదిలించుకోవడానికి బాబా అలా చెప్పారనుకొని అక్కడి నుండే తండ్రి పరిస్థితిని తెలియచేయమని ఇంటికి టెలిగ్రాం ఇచ్చాడు. వెంటనే ఇంటి వద్ద నుండి అతని తండ్రి రోగం పూర్తిగా నివారణైందని టెలిగ్రాం వచ్చింది. అతడు కృతజ్ఞతతో తాజుద్దీన్ బాబా పాదాలపై బడి నమస్కరించాడు. సంతోషంతో ఆ రోజంతా పేదలకు అన్నదానం చేశాడు

### డా॥ కె.బి. పేనాస్కర్

డాక్టర్ అబీద్ మాత్రమే కాక బాబా మహిమలను చూచినవారు ఆసుపత్రిలో ఇంకా ఎందరో వున్నారు. తాజుద్దీన్ బాబాకు గొప్ప భక్తుడైన డా॥ పేనాస్కర్ అనుభవం మరీ విచిత్రంగా వుంటుంది.

డాక్టరు పేనాస్కర్ మొదట్లో పాట్నాలో వైద్య శాస్త్రం అభ్యసిస్తుండేవాడు. అయితే ఆయనకు ప్రభుత్వ ఆసుపత్రిలో డాక్టరుగా ఉద్యోగం చేయాలని కోరికగా ఉండేది. ఒకసారి గంగానదిలో స్నానం చేయడానికి వెళ్తుండగా డాక్టరు దృష్టి

బ్రహ్మవర్చస్సుతో ప్రకాశిస్తున్న ఒక బ్రహ్మచారి బాబా మీద పడింది. ఆయనలోని విచిత్రతకు ఆకర్షితుడైన డాక్టరు కొంచెం సేపు ఆయనతో మాట్లాడాక తన కోరిక ఫలవంతమయ్యేటట్లు ఆశీర్వదించమని, తనకు ప్రభుత్వ ఉద్యోగం లభించేటట్లయితే ఆయనను తీర్థ యాత్రలకు తన ఖర్చు మీద తీసుకువెళ్ళగలనని బ్రహ్మచారి బాబా ను ప్రార్థించాడు. అతి త్వరలోనే అతనికి నాగపూరు ఆస్పత్రిలో డాక్టరుగా ఉద్యోగం లభించింది. 'బ్రహ్మచారి బాబా' కు వాగ్దానం చేసినట్లు డాక్టరు ఆయనను తీసుకొని తీర్థ యాత్రలు చేశాడు. 'బ్రహ్మచారి బాబా' అతనికి నాగపూర్‌లో ఉద్యోగం వచ్చినందుకు ఎంతో సంతోషించారు. తీర్థయాత్ర పూర్తి చేసాక డాక్టర్‌తో పాటు ఆయన కూడా నాగపూర్ వచ్చారు. నాగపూర్ చేరగానే 'బ్రహ్మచారి బాబా' డాక్టరును వెంటబెట్టుకొని పిచ్చాసుపత్రి గేటు వద్దకు నేరుగా వచ్చారు. అక్కడ నుండోలి ఆయన పెద్దగా, "ఓ సోదరుడా తాజుద్దీన్ ! ఇదుగో ఇతడు మనపిల్లవాడు. ఇతనిని నీకు అప్పగిస్తున్నాను. ఇతని బాగోగులన్నీ ఇక మీదట నువ్వే చూడాలి" అని చెప్పి అక్కడ చేరి వింతగా చూస్తున్న ప్రజలను, డాక్టరును ఆశ్చర్యంలో ముంచెత్తుతూ అక్కడే బ్రహ్మచారి బాబా అదృశ్యులయ్యారు. అది చూసి అందరూ నిశ్చేష్టులయ్యారు. వారంతా వింటూ వుండగా ఆ సమయంలో ఆస్పత్రిలోపల ఒక చెట్టు క్రింద కూర్చుని వున్న 'తాజుద్దీన్ బాబా' 'బ్రహ్మచారి బాబా' మాటలకు సమాధానంగా. "అవునవును అలాగే, అతను మన కుటుంబంలోని వాడే, మనల్ని విడిచి ఇతనెక్కడికి పోతాడు ?" అని తనలో తాను అనుకుంటున్నారు.

డాక్టరు పేనాస్కర్ ఆ సంఘటనకూ ఆ మహాత్ములిద్దరి మధ్య జరిగిన అద్భుత సంభాషణకే గాక వారిద్దరూ ఇంతకు మునుపు ఒకరికొకరు పూర్తిగా పరిచయం లేని వారని తెలిసి మరీ ఆశ్చర్యపోయాడు. కొంత కాలం గడిచాక తాజుద్దీన్ బాబా డా॥ పేనాస్కర్‌ను పిలిచి సాకోరి వెళ్ళి శిరిడీ సాయి శిష్యుడైన ఉపాసనీ మహారాజ్ దర్శనం చేసుకోమని చెప్పారు. ఉపాసనీ మహారాజ్‌ను దర్శించాక తాజుద్దీన్ బాబా తనకు సరైన సమయంలో చక్కటి సలహా ఇచ్చారని తెలిపాడు పేనాస్కర్. ఈ విధంగా డాక్టర్ పేనాస్కర్ పీర్‌సాహెబ్ (బ్రహ్మచారి బాబా రూపంలో) తాజుద్దీన్ బాబా ఉపాసనీ మహారాజ్‌ల ఆశీస్సులతో అద్భుత

లీలను ఆధ్యాత్మికంగా ఉద్ధరింపబడ్డారు. ప్రఖ్యాతి వహించిన ఆ ముగ్గురు మహాత్ములూ మూడు రకాలైన సాంప్రదాయాలకు చెందిన వారైనప్పటికీ, ముగ్గురూ కలసి ఒకే శక్తి పునర్వివృద్ధికి బాధ్యత వహించారు. అందుకే వారికి వారి సాంప్రదాయభేదాలు ఏ మాత్రము అడ్డు రాలేదు.

## డాక్టర్ కాశీనాథరావ్

డాక్టరు ఏజీస్ ఎస్‌పీ విరమణ తరువాత డాక్టరు కాశీనాథరావ్ నాగపూర్ పిచ్చాసుపత్రికి అధికారిగా నియమింపబడ్డారు. ఆయన హిందువు, ఆచారవంతుడైన బ్రాహ్మణుడైనప్పటికీ తాజుద్దీన్ బాబాకు గొప్ప భక్తుడైనారు. ఆయనకు బాబాతో గల అనుభవం వింటే ఎంతో ఆశ్చర్యానుభూతులు కలుగుతాయి.

ఒకసారి డాక్టర్ కాశీనాథ రావ్ ఆసుపత్రిలోని తన గదిలో ఒక్కడే కూర్చుని వున్నాడు. ఇంతలో ఆయన ఎదురుగా తాజుద్దీన్ బాబా కూర్చుని కనిపించారు. అంతకు కొద్దిసేపు క్రితమే ఆయన తాజుద్దీన్ బాబా వాసం చేస్తున్న గదిలో వుండటం చూశాడు. హఠాత్తుగా ఆయన తన గదిలో కనిపించేసరికి డాక్టరుకు ఆశ్చర్యంతో పాటు భయం గూడా వేసింది. దిగ్భ్రమనుండి ఆయన తేరుకోక మునుపే ఎక్కడ నుంచో 'సలామ్ అలేకుం బాబా తాజుద్దీన్' అనే వింతైన శబ్దము వినిపించింది. వెంటనే తాజుద్దీన్ బాబా, "వా అలేకుం-అస్-సలామ్" అని సమాధానమిచ్చారు. అదే సమయంలో గోడలో నుండి ఒక పెళ్ళ వూడిపడి, అందులో నుంచి ఒక హస్తం బయటకు వచ్చింది. ముస్లింలు దానిని 'పంజా' అంటారు. తాజుద్దీన్ బాబా ఆ చేతి దగ్గరకు వెళ్ళి ఆ చేతితో తన చేతిని కలిపారు. ఆశ్చర్యంతో డాక్టర్ ఇదంతా చూస్తుండగా ఆ చెయ్యి, తాజుద్దీన్ బాబా కూడా అదృశ్యులైనారు. వెంటనే డాక్టర్ కాశీనాథరావ్ తాజుద్దీన్ బాబా వుండే గది దగ్గరకు పరుగెత్తి వెళ్ళి చూశారు. వాసము చేసిన గదిలో ప్రార్థనలో మునిగి వున్న తాజుద్దీన్ బాబాను చూచిన డాక్టర్ ఆశ్చర్యానికి అంతులేదు!

ఈ విధంగా ఆధునిక శాస్త్రాన్ని అభ్యసించిన ఎందరో వైద్యులు ప్రతిరోజూ బాబాచేసే ఏదో ఒక మహిమను చూచి ఆయనను తమ రక్షకుడిగా, ఉపకారిగా గుర్తించారంటే ఆశ్చర్యం లేదు.

## పక్షవాత రోగి

తాజుద్దీన్ బాబా ప్రదర్శించిన అద్భుతమైన మహిమలకు అంతు లేదు. ఒకసారి ఒక వృద్ధుడు తన అల్లుణ్ణి తీసుకొని నాగపూర్ వచ్చాడు. అతనికి పక్షవాతము వచ్చి ఒక చెయ్యి పూర్తిగా చచ్చుబడి పోయింది. అతడు తాజుద్దీన్ బాబాను చూడడానికి పిచ్చాసుపత్రికి వచ్చాడు. ఆస్పత్రి ఆవరణలో ఒక వేప చెట్టు క్రింద మద్రాసు నుంచి వచ్చిన ఒక యాత్రికుని కలుసుకుని అంతదూరం నుంచి యిక్కడికి ఏం పని మీద వచ్చారని అడిగాడా వృద్ధుడు. అందుకు సమాధానంగా ఆ వ్యక్తి "నన్ను తాజుద్దీన్ బాబా ఎన్నడూ రక్షించారు. మద్రాస్లో ఆయన నాతో పాటు 2, 3 రోజులు వున్నారు. వారి ఆహ్వానం మీదే వేసుకుని వచ్చాను" అన్నాడు. అది వింటూ అక్కడే వున్న డాక్టరు కాశీనాథ రావ్ ఆశ్చర్యపోయారు. ఎందుకంటే కొన్ని సంవత్సరాలుగా తాజుద్దీన్ బాబా పిచ్చాసుపత్రి దాటి ఎక్కడకూ వెళ్ళలేదని, బాబాను మళ్ళా వెళ్ళి అక్కడ రోజులు గడిపేటంత అవకాశం ఎప్పుడూ రాలేదని ఆయనకు తెలుసు! ఆశ్చర్యంలో మునిగిపోయిన డా॥ కాశీనాథ రావ్ పరుగున వెళ్ళి భక్తితో తాజుద్దీన్ బాబా కాళ్ళ మీద పడ్డారు. ఆయన కళ్ళ వెంట ధారగా నీళ్ళు కారుతున్నాయి. అప్పుడు బాబా డాక్టరుతో "ఈ సంఘటనను గురించి యితరులకు చెప్పి నన్ను కీర్తించకు" అన్నారు. తాజుద్దీన్ బాబా ఆ పక్షవాత రోగి చెయ్యి పట్టుకొని, "ఓ! ఇది నిజమైన రోగం కాదే!" అన్నారు. తాజుద్దీన్ బాబా అలా చెయ్యి పట్టుకోగానే కొంచెం కొంచెంగా ఆ చెయ్యి వేడెక్కసాగింది. కొద్ది సేపు అలా పట్టుకున్న తరువాత బాబా ఆ చేతిని గట్టిగా విదిలించి వదిలేశారు. వెంటనే ఆ వృద్ధుని చేతికి పూర్తి స్వస్థత వచ్చింది. బాబా అతనితో "దేవుడు నిన్ను బాగు చేసినందుకు కృతజ్ఞతగా మక్కా యాత్ర చేయకేం !?" అన్నారు.

ఒకరోజు తాజుద్దీన్ బాబా దగ్గరకు ఒక పెద్దమనిషి వచ్చాడు. వస్తూనే ఆయన బాబాకు నమస్కరించి, "ఓ మహాత్మా! నా కూతురు అవసాన క్షణంలో వుంది. దయచేసి ఆమెకు జీవితాన్ని ప్రసాదించండి" అని దీనంగా ప్రార్థించాడు. బాబా ప్రశాంతంగా కొద్దిసేపు ఆ పెద్ద మనిషి ముఖంలోకి చూశారు. తరువాత కళ్ళు మూసుకొని కొద్దిసేపు సమాధిలోకి వెళ్ళారు. నెమ్మదిగా కళ్ళు తెరచి అతనితో

"నువ్వు ఇంటికి వెళ్ళు, ప్రమాదం తప్పిపోయింది. ఇప్పుడు నీ కూతురు క్షేమంగా వుంది" అన్నారు. ఆ పెద్దమనిషి ఇంటికి వెళ్ళి చూడగానే తన కూతురు కూర్చొని ఏదో తింటూవుంది. బాబా ప్రదర్శించిన కరుణ పట్ల కృతజ్ఞతతో కరిగిపోతూ యింత త్వరలో అమ్మాయి యెలా కోలుకుందని భార్యనడిగాడు. అప్పుడామె బాబా దర్శనం కోసం వెళ్ళిన కొద్దిసేపటికి, గుమ్మం ముందు ఒక ఫకీరు కనిపించాడని, ఆమె దుఃఖిస్తూ వుండడం చూసి కారణమడిగాడనీ, పిల్ల పరిస్థితి ప్రమాదకరంగా ఉందని తెలుసుకొని లోపలికి వచ్చి రోగి మంచం మీద కూర్చొని ఆయన చేతితో ఒక్కసారి నిమిరి, "అన్నా అల్లా, ఇప్పుడు వెంటనే రోగికి స్వస్థత చేకూరుతుంది" చెప్పి వెళ్ళారని, ఆయన వెళ్ళిన కొద్దిసేపటికల్లా అమ్మాయి లేచి కూర్చొని తినడానికి ఏమైనా పెట్టమని అడిగిందనీ వివరంగా భర్తతో చెప్పింది.

### ఫోటో నుండి బాబా అదృశ్యం

ఒక సారి బాబాను చూడడానికి అలీఘర్ ముస్లిం యూనివర్శిటీ నుండి విద్యార్థుల బృందం వచ్చింది. వారంతా అట్టాగా కలిసి బాబాతో ఫోటో తీసుకున్నారు. ఆ విద్యార్థులను ఆశ్చర్యంలో ముంచుతూ ఆ ఫోటోలో మిగతా అందరి బొమ్మలు స్పష్టంగా పడగా తాజుద్దీన్ బాబా బొమ్మ మాత్రం యెక్కడా కనిపించలేదు.

### కానుకలు

బాబా చేసే అటువంటి లీలలకు లెక్కలేదు. తిరుగులేని ఆయన ఆశీర్వచనం కోసం రోజూ ఎందరో భక్తులు పిచ్చాసుపత్రికి వచ్చేవారు. వారంతా బాబా దర్శనం కోసం బారులు తీరి వరుసలో నుంచునేవారు. వారాయనకు బట్టలు, పండ్లు, మధురమైన వంటకాలు, బీడీలు వస్త్రాలు ఎవరి తాహతును బట్టి వారు సమర్పిస్తుండేవారు. బాబా వాటిని తన చేతితో తాకి తిరిగి వారికే యిచ్చేవారు. లేదా ఆ గుంపులో తనకెవరికి ఇవ్వదలచితే వారికి ఇచ్చేవారు. తాజుద్దీన్ బాబా దివ్యశక్తులు చూశాక ఆయన భక్తులైన పెద్ద పెద్ద డాక్టర్లు ఆయనను మిగతా రోగులవలె గాక ప్రత్యేకంగా చూసేవారు. మిగతా రోగులు తప్పనిసరిగా

వేయవలసిన శారీరక శ్రమను బాబా గారి చేత చేయనిచ్చేవారు కాదు. ఆయన గదికి వారు తాళం కూడా వేసేవారు కాదు. కానీ బాబా అందుకు అనుమతించక అందరితో పాటు తను కూడా పనులలో పాల్గొనేవారు. తన గదికి ఆయనేకోరి తాళం వేయించుకొనేవారు. ఇతర రోగుల నుండి ప్రత్యేకంగా తనను చూడడానికి ఆయన ఆసుపత్రి సిబ్బందిని అనుమతించేవారు కాదు.

ఆసుపత్రి సిబ్బంది ప్రవర్తన బాబా పట్ల ఇలా ఉండగా అప్పటి ప్రభుత్వం మాత్రం వేరే దృష్టితో చూసింది. ఆయన ఆశీర్వచనాలు పొంది తమ కోరికలు తీర్చుకోవడానికి ఎందరో ఆంగ్లేయులు కూడా బాబా దగ్గరకు వస్తుండటంతో ప్రభుత్వం బాబాను చూడడానికి వచ్చే వారి నుండి పన్ను వసూలు చేయటానికి నిశ్చయించింది.

## బాబా భక్తులైన ఆంగ్లేయులు

నాగపూర్‌కు చీఫ్ కమీషనర్ అయిన కర్నల్ రో అనువారు బాబా భక్తులైన ఆంగ్లేయులలో ముఖ్యులు. పెద్ద హోదాలో ఉద్యోగం చేస్తున్న వారు కూడా బాబా దర్శనార్థం వస్తుండేవారు. Extra Asst. కమీషనర్ అయిన పాటిల్, విలయత్ ఉల్లాఖాన్, నాగపూర్ పట్టణ పోలీసు సూపరింటెండెంట్‌గా వున్న Mr. మోటీ అనేవారు కూడా బాబాకు ముఖ్య భక్తులు. నాగపూర్ మహారాజ్ అయిన రఘూజీరావ్ భోంస్లే బాబా దగ్గరకు తరచూ వచ్చేవారు. వీరంతా తమ వ్యక్తిగత, సామాజిక సమస్యల పరిష్కారం కోసం వచ్చి తాజుద్దీన్ బాబా ఆశీర్వచనాలు పొందేవారు.

## నాగపూర్ మహారాజ్ ఔదార్యం

తాజుద్దీన్ బాబా పిచ్చాసుపత్రిలో వుండటం సహజంగా లేదు. ఆయనను బైటకు తీసుకువెళ్ళి సరియైన స్థానంలో వుంచాలనే ఆలోచన మొదటిసారిగా నాగపూర్ మహారాజైన రఘూజీరావ్ భోంస్లేకు కలిగింది. ఆయన ఆసుపత్రి వారికి రూ. 2000/- చెల్లించి బాబాను పిచ్చాసుపత్రి నుండి తన స్వంత భవనానికి తీసుకువెళ్ళారు 1908వ సంవత్సరములో. అంతటితో తాజుద్దీన్ బాబా 16 సంవత్సరాల 'పాగల్‌ఖానా' జీవితం ముగిసింది.

ఆ మహారాజా సకొండరాలో వున్న లాల్‌కోఠి అనే భవనంలో తాజుద్దీన్ బాబాను వుంచి, ఆ భవనాన్ని ఆయన ఉపయోగార్థమే వదిలేశారు. అంతేకాక బాబా వాడుకోవడానికి ఒక గుర్రాలబగ్గీని, ఆయన సేవకులుగా కొందరు పహిల్వాన్లను నియమించారు. తరచుగా ఆయన కూడా బాబా దర్శనార్థం వచ్చే వారు. కాని రాజులకు రాజైన ఆ మహాత్ముడు నియమం తప్పక ఫకీర్ ధర్మాన్నే పాలించేవారు.

## లాల్‌కోఠిలో బాబా జీవితం

లాల్‌కోఠిలో వుండగా బాబా ఎక్కువ సమయం సమాధిలో గడిపేవారు. ఉదయమే నిద్రలేచి భవనంలో నుంచి వెళ్ళి మధ్యాహ్నం రెండు గంటల సమయం లోపో లేక సాయంత్రమో తిరిగి వచ్చేవారు. ఎప్పుడూ ఆయన చుట్టూ చుట్టు ప్రక్కల వాళ్ళూ, దూర ప్రదేశాల నుంచి వచ్చేవారూ పూల దండలు, వివిధ నైవేద్యాలూ పట్టుకొని వుండేవారు. ప్రతిరోజూ అక్కడ పండుగే. ఆయన తిరిగే ప్రదేశమంతటిలోనూ రకరకాల దుకాణాలు వెలిశాయి. బాబా ముందు వాద్యగాళ్ళు, వివిధ కళాకారులు ప్రదర్శనమిస్తూ ఆయన ప్రశంసలందుకునేవారు. బాబా ఎక్కడికి వెళ్తే అక్కడికి భక్తులంతా వెంబడించేవారు. చివరకు నాగపూర్ అడవులలోనైనాసరే ఆయనను వదిలేవారు కాదు. వందలాది ప్రజలు పళ్ళాలలో పెట్టుకొని ఆయనకు నైవేద్యాలు తెచ్చేవారు. అందులో ఏదో ఒక పళ్ళెంలోంచి ఆయన కొంచెంగా తీసుకొని రుచి చూచి భక్తులను తృప్తిపరచేవారు. మిగతా పదార్థాలన్నీ ప్రత్యేకించి అనాధలకు, పేదవారికి పంచేవారు. తాజుద్దీన్ బాబా ఎప్పుడూ ఒకటే పొడుగైన కాఫ్నీనో లేకపోతే పొడుగాటి చొక్కానో తొడుక్కునేవారు.

డా॥ అబ్దుల్ మజీద్‌ఖాన్ బాబాకు గొప్ప భక్తుడు. డా॥ కాశీనాథరావ్ తాజుద్దీన్ బాబాకు హిందూ దేవుళ్ళకు చేసినట్లే పూజలు చేసేవాడు. ఆయన శిరస్సుపై పూలు నుంచేవాడు. నుదుటన గంధం రాసేవాడు. ఇటువంటి ఉపచారాలను ఎన్నో చేసేవాడు ఆయన అలా చేస్తుంటే తాజుద్దీన్ బాబా ఎప్పుడూ అడ్డు చెప్పేవారు కాదు.

## బాబా రాజభవనాన్ని వదలి వాకీ వెళ్ళడం

ఫకీరైన తాజుద్దీన్ బాబా రాజభవనంలో నివసించడానికి ఎంత మాత్రం ఇష్టపడలేదని చెప్పాలి. కాని మహారాజా రాఘోజీరావు మరీ మరీ ప్రార్థించిన మీదట ఆయన కొంత కాలం రాజభవనంలో నివసించడానికి అంగీకరించారు. రాజ భవనంలో సకల సదుపాయాలూ వున్నప్పటికీ ఆయన నేలమీదే నిద్రించే వారు. తీవ్రమైన ఎండల్లో కూడా ఆయన కాళ్ళకు చెప్పులు లేకుండా నడిచేవారు. నిజానికి ఆ రాజభవనం కూడా బాబా తాజుద్దీన్‌కు ఒక కారాగారం లాంటిదే. ఆయన నాగపూర్ అడవులలో స్వేచ్ఛగా తిరుగుతూ నిజమైన ఫకీరు జీవితాన్ని గడపటాన్నే కోరుకునేవారు.

ఒకరోజున తాజుద్దీన్ బాబా రాజభవనాన్ని వదలి నేరుగా నాగపూర్‌కు 18 మైళ్ళ దూరాన వున్న 'వాకీ' అనే గ్రామానికి వెళ్ళారు. అక్కడ పటేల్ అయిన కాశీనాథరావు బాబాను ఆహ్వానించి ఆయనను సేవించారు. వాకీ ప్రజలు ఆయనను ఎండల్లో, వానల్లో, చలిలో తిరుగుతుండటం, కాళ్ళకు జోళ్ళు లేకుండా ఆయన నడుస్తుండటం చూస్తుండేవారు. ఆయన చొక్కా వానలో తడిస్తే అది ఆయన ఒంటిమీదే ఎండిపోయేది. సకోర్‌దరాలో లాగానే ఇక్కడ కూడా బాబా అనేక మహిమలు చూపారు. వాకీలో ఉండగా బాబా అక్కడ ఒక మామిడి చెట్టుకు ఆసుపత్రి అని పేరు పెట్టారు. రోగిష్టివారు కోసం వచ్చే వారందరినీ ఆయన ఆ మామిడిచెట్టు క్రింద కూర్చోమని, అక్కడ మట్టినే మందుగా ఉపయోగించమని చెప్పేవారు. అలా చేస్తే వ్యాధులు తప్పనిసరిగా నివారణ అయ్యేవి. ఒక ప్రదేశాన్ని బాబా 'మసీద్' అని పిలిచేవారు. ఆధ్యాత్మిక అభివృద్ధి కోసం వచ్చే భక్తులను అక్కడ కూర్చొని ప్రార్థన చేయమనేవారు. అక్కడ (ఆ మసీదులో) కూర్చొని పాప పరిహారం చేసుకున్న వారిలో సాక్షాత్తు మహాత్ముడైన మెహర్ బాబా (అహమ్మద్ నగర్), గొప్ప మహాత్ముడూ షిరిడీ సాయి భక్తుడూ అయిన ఉపాసనీ మహరాజ్ ముఖ్యులు. తాజుద్దీన్ బాబా అక్కడే వున్న ఇంకొక ప్రదేశాన్ని 'న్యాయస్థాన' మనేవారు. కోర్టు గొడవలలోగాని లేక ఏదైనా చట్ట సంబంధమైన సమస్యల పరిష్కారం కోసం గాని వచ్చే భక్తులను ఆయన ఆ న్యాయస్థానంలో కూర్చోమనేవారు. భక్తుల సమస్యలు అక్కడ కూర్చుంటే చాలు

పరిష్కారమయ్యేవి. ఆయన అక్కడ ఒక ప్రదేశానికి “హుజ్రా” అని పేరు పెట్టారు. పరీక్షలలో ప్రథమ శ్రేణిలో ఉత్తీర్ణులయ్యేటట్లు ఆశీర్వదించమని అడిగేవారిని బాబా ఆ బల్లో కూర్చోమనేవారు.

## షేరు

బాబా సకరదరాలోను, వాకీలోను వుండగా చేసిన లెక్కకు మించిన మహిమలు భక్తునికోసమో ఎవరికోసమో వారిని బ్రతికించడం. నివారణ చేయడం ఏవిధమైనా కాని వ్యాధులను నివారించడం ఆశ్చర్యం గొలిపేలాగ ఉంటాయి.

అటువంటి సంఘటనలన్నింటిలోకి ఖ్యాతి చెందిన లీల బాబా “షేరూ” అనే పెంపుడు కుక్కను బ్రతికించడం. ఆ కుక్క బాబా లోని గొప్పతనాన్ని గుర్తించి తనకాలాన్ని బాబా సేవలోను, భక్తుల సేవలోనూ గడిపేది. ప్రతి రోజూ షేరు రైలు వచ్చే సమయానికి ఖచ్చితంగా రైల్వేస్టేషన్‌కు వెళ్ళేది. అక్కడ నుండి బాబా దర్శనార్థం వచ్చే యాత్రికులను నేరుగా బాబా వున్న చోటుకు చేర్చేది. బాబా ఒక్కొక్కప్పుడు వాకీలో ఉండేవారు. లేదా చుట్టుపక్కల అడవులలో ఎక్కడో తిరుగుతుండేవారు. భక్తులు ఆయన జాడ తెలియక బాధపడకుండా షేరూ వారిని నేరుగా ఆయన వున్నచోటికి చేర్చేది. షేరూ బ్రతికి వున్నంత కాలమూ నియమం తప్పక ప్రతిరోజూ ప్రతి రైలు దగ్గరకూ వెళ్ళేది. భక్తులందరూ రైలు దిగగానే ముందు షేరూ కోసం చూచేవారు. నేరుగా దానివెంటే వెళ్ళేవారు.

ఒకసారి ఒక భక్తుడు వాకీలో రైలు దిగాడు. అలవాటు ప్రకారం ఆయన షేరూ కోసం చూచాడు. కానీ షేరూ ఎక్కడా కనిపించలేదు. తరువాత ఆయన మరో యాత్రికులతో కలిసి తాజుద్దీన్ బాబా దగ్గరకు బయల్దేరాడు. త్రోవలో వారంతా షేరూ గురించే మాట్లాడుకుంటూ ఆ రోజు అది స్టేషన్‌కు రాకపోవడం వింతగా వుందని అనుకోసాగారు. వారు వెళ్ళిన సమయానికి తాజుద్దీన్ బాబా ఆయన కుటీరంలో లేరు. ఆ భక్తులాయన కోసం అడవులలో కొంత దూరం వెదకవలసి వచ్చింది. షేరూ వుంటే వారిని నేరుగా బాబా దగ్గరకు తీసుకువెళ్ళేది వారికి అడవులలో తిరిగే శ్రమ తప్పేది. షేరూ లేనిలోటు వారికి బాగా తెలిసింది. అడవులలో బాబా కోసం వెతుకుతుండగా వారు షేరూ మృత కళేబరాన్ని చూచి

నిశ్చేష్టులైపోయారు. అది చూసి వారికి విపరీతమయిన దుఃఖం కలిగింది. చివరకు వారంతా బాబాను కలుసుకొని ఏడుస్తూ షేరూ నిర్జీవంగా పడి వున్న సంగతి ఆయనకు చెప్పారు.

అది విన్న తాజుద్దీన్ బాబా "షేరూ చనిపోవడం అసంభవం రండి. పోయి చూద్దాము" అని భక్తులందరితో కలసి షేరూ పడి వున్న చోటికి వచ్చారు. ఆయన షేరూ మృతదేహాన్ని ఒక బుట్టలో వుంచమని భక్తులలో ఒకరిని కోరారు. తరువాత ఆయన తన పాదుకాలి చొక్కాను ఆ బుట్టపై కప్పారు. అందరూ కలసి ఆ బుట్టను తీసుకొని బాబా కుటీరానికి బయల్దేరారు. కానీ కొంత దూరం నడిచారో లేదో బుట్టలో నుంచి షేరూ క్రిందకు ఒక దూకు దూకి, అందరూ తెల్లముఖాలు వేసుకు చూస్తుండగా తన యజమానియైన తాజుద్దీన్ బాబా దగ్గరకు వెళ్ళి తన విశ్వాసాన్ని ప్రకటించసాగింది. తరువాత షేరూ కొంతకాలం జీవించింది. అది చనిపోయినప్పుడు తాజుద్దీన్ బాబా దాని మృతదేహంపై తన తెల్లని చొక్కాను కప్పి సమాధి చేయించారు. ఇప్పటికీ ఆ సమాధి అందరూ దర్శించడానికి వీలుగా భద్రపరచబడివుంది. కుక్క కరచినవారు ఆ సమాధిని దర్శించి షేరూకు చెప్పుకుంటే వారు ఆ బాధ నుంచి నివారణ పొందుతున్నారు.

## గిరిజాబాయి

బాబా గిరిజాబాయిని బ్రతికించడం బహుళ ప్రచారంలోకి వచ్చిన లీలలలో ఒకటి. గిరిజాబాయి అనే ఆమె భయంకరమైన వ్యాధితో బాధ పడుతూ ఉండేది. ఎన్నో చికిత్సలు నిష్ఫలం కాగా. ఆమె రోగ నివారణ కోసం తాజుద్దీన్ బాబాను సేవిస్తూ ఉండేది. ఒకరోజు కాశీనాథరావ్ పటేల్ మనుష్యులు ఆమె తన కుటీరంలో జీవం లేకుండా పడి ఉండడం చూసి పటేల్‌తో ఆ విషయం చెప్పారు. కాశీనాథరావ్ పటేల్ గిరిజాబాయి చనిపోయిన విషయం చెప్పి ఆమెను దహనం చేయించమంటారో, లేక సమాధి చేయించమంటారో తెలుసుకొని రమ్మని తాజుద్దీన్ బాబా దగ్గరకు మనిషిని పంపాడు. ఆ సమయంలోనే తాజుద్దీన్ బాబా గిరిజాబాయికి టీ ఇచ్చిరమ్మని తన భక్తులలో ఒకరిని గిరిజా బాయి కుటీరానికి పంపారు. ఇద్దరు వ్యక్తులూ దారిలో కలుసుకున్నారు. పటేల్ పంపిన వ్యక్తి టీ

తీసుకువెళ్తున్న భక్తునితో ఇక 'టీ' తీసుకుపోయే శ్రమ అనవసరమని, గిరిజాబాయి అంతకు ముందే చనిపోయిందనీ చెప్పారు. కానీ బాబా యందు అచంచల విశ్వాసం గల ఆ భక్తుడు ఆ మాటలను నమ్మక టీ తీసుకుని గిరిజాబాయి కుటీరానికి వెళ్ళాడు. అక్కడ గిరిజాబాయి నిజంగానే చనిపోయి వుంది. ఆమె చుట్టూ చేరి ముగ్గురు నలుగురు స్త్రీలు శోకాలు పెడుతూ ఏడుస్తూ వున్నారు. విచారకరమైన ఆ పరిస్థితినుంచి తేరుకుంటూ ఆ టీ తెచ్చిన వ్యక్తి గట్టిగా గిరిజాబాయి శవాన్ని సంబోధించి తాజుద్దీన్ బాబా టీ పంపారని ఆ మృతశరీరంతో మూడు సార్లు బిగ్గరగా చెప్పాడు. ఆశ్చర్యకరంగా గిరిజాబాయి తాజుద్దీన్ బాబా పేరును ఉచ్చరిస్తూ తనలో జీవశక్తి లక్షణాలను ప్రదర్శించి నెమ్మది నెమ్మదిగా ఆ భక్తుడు చేతిలో వున్న 'టీ' ని పుచ్చుకొని త్రాగేసింది. కొంచెం సేపట్లోనే ఆమె లేచి కూర్చొని, తాజుద్దీన్ బాబా ఎక్కడ" అని అడుగుతూ కుటీరం నుంచి బయటకు వచ్చింది. ఈ సంఘటన చూసి అక్కడ చేరిన వారందరూ నిర్ఘాంతపోయారు. ఇంతలో తాజుద్దీన్ బాబా అక్కడకు రానే వచ్చారు. బాబా ఆమెతో భగవంతుని కీర్తిస్తూ పాటనొకదానిని పాడమని చెప్పారు. ఆమె అత్యంత మధురంగా గానం చేసింది. ఈ సంఘటన దావానలం లాగా పట్టణమంతా క్షణంలో పాకిపోయింది. తరువాత గిరిజాబాయి చాలా సంవత్సరాలు జీవించి మహాస్థితిని పొందింది.

## తుకారాం

తుకారాం అనేవాడు 30 సంవత్సరముల నుండి మొండిగా పట్టుకున్న దగ్గుతో బాధపడుతూ వున్నాడు. ఆ దగ్గు తుకారాంను రాత్రిళ్ళు హాయిగా నిద్రపోనిచ్చేది కాదు. ఎన్ని వైద్యాలైనా లొంగేది కాదు. తుకారాం స్నేహితులు దగ్గు తగ్గటం కోసం అతనిని వాకీ వెళ్ళి తాజుద్దీన్ బాబాను దర్శించుకోమన్నారు. అతను స్నేహితుల సలహాను అంతగా పట్టించుకోలేదు. అయినా తాజుద్దీన్ బాబా అతనిని వదలక ఆయనే తుకారాంను తన దగ్గరకు రప్పించుకున్నారు. అతనొకసారి తన సేఠ్ యజమాని వెంట వాకీ వెళ్ళవలసి వచ్చింది. వారు అక్కడ వుండగా ఒకరోజు టీ తీసుకువెళ్ళి తాజుద్దీన్ బాబాకు ఇవ్వాలనే ప్రేరణ తుకారాంకు కలిగింది. అతను టీ తయారుచేసి వెండి గ్లాసులో పోసుకొని

తాజుద్దీన్ బాబా ఆశ్రమానికి బయలుదేరాడు. దుష్ట స్వభావం గల అతని సేట్ తెలిస్తే ఎక్కడైనా పోతుందేమోననే భయంతో అందుకు అభ్యంతరం పెట్టాడు. ఎలాగో సేటుకు నచ్చ జెప్పి తుకారాం బాబా వద్దకు బయలుదేరాడు. బాబాకు ఇంకా తుకారాం వందల గజాల దూరంలో వుండగానే తుకారామునుద్దేశించి బాబా, "ఏం? గ్లాసుతో తెస్తున్నావేమి" అని అడిగారు. బాబాలోని సర్వజ్ఞత్వాన్ని గుర్తించిన తుకారాం ఆయనకు పాదాభివందనం చేసి తను తెచ్చిన టీని సేవించమని ఆయనను కోరాడు. కరుణామయుడైన బాబా అతని ప్రార్థనను అంగీకరించి గ్లాసు అందుకున్నారు. తుకారాంతో బాబా "నీవు గనుక 30 సంవత్సరాల క్రిందట ఇక్కడికి వచ్చినట్లయితే ఇన్నేళ్ళుగా ఈ వ్యాధి నిన్ను బాధించేది కాదు గదా!" అన్నారు. తనకు ఎటువంటి వ్యాధి వున్నదో, అది ఎన్ని సంవత్సరాల నుండి తనను బాధిస్తున్నదో తను చెప్పకుండానే తెలుసుకున్న మహాత్ముడైన బాబా శక్తికి తుకారాం ఆశ్చర్యపోయాడు. అప్పుడు తాజుద్దీన్ బాబా క్రింద నుండి ఒక చిటికెడు మట్టి తీసుకొని, "దీనిని తిను. నీకు నయంగా ఉంటుంది" అన్నారు. తుకారాం దానిని సేవించిన వెంటనే అతని వ్యాధి మటుమాయమైంది. ముప్పది సంవత్సరాల తరువాత మొదటిసారిగా ఆ రోజు రాత్రి గాఢ నిద్రలో మునిగి పోయాడు తుకారాం. ఇది చూసి అతని సేట్ గూడ ఆశ్చర్యపోయాడు.

ఒక రోజు రాత్రి 8 గంటలకు ఒక భక్తుడు రొట్టెలు తెచ్చి బాబా ముందుంచి ఆరగించమని ప్రార్థించాడు. "ఆగు. నా భోజనం ఇప్పుడే వస్తుంది" అని అక్కడ నుండి లేచి తమ కుటీర ద్వారం వద్ద నిరీక్షిస్తూ కూర్చున్నారు. కొద్ది సేపటికి జబ్బు మనిషి ఒకామె వచ్చి తన చంకలోనున్న 6 ఏళ్ళ పిల్లను ఆయన ముందుంచింది. ఆ పిల్ల లేచి నిలబడడానికి, నడువడానికి శక్తి లేక చచ్చుబడిన కాళ్ళు, చేతులతో అక్కడే కూర్చుండిపోయింది. బాబా అమ్మాయిని చూసి "లే! నిలబడు" అని రెండు సార్లు గర్జించారు. మూడవసారి "నువ్వు లేచి నా వెనకనే రా" అని ఆదేశించి గుడి లోపలికి వెళ్ళారు. వెంటనే ఆ పిల్ల లేచి ఆయనతో పాటు లోపలకు వెళ్ళింది. అప్పుడు బాబా ఆ స్త్రీ సమర్పించిన నైవేద్యాన్ని ఆరగించారు.

ఒకసారి బాబా ఒక చెట్టు క్రింద కూర్చున్నారు. అచటవున్న భక్తుల మధ్య లోనికి ఒక స్త్రీ శోకాలు పెడుతూ వచ్చింది. "నా భర్త ప్రాణాన్ని రక్షించు బాబా" అని ఆమె వేడుకుంటోంది. ఆయన ఒక్క క్షణం కళ్ళు మూసుకుని మరల ఆమెకేసి చూస్తూ "నీ భర్తకి మరణ శిక్ష వెయ్యరులే!" అన్నారు. ఆమె ఎంతగానో సంతోషించి ఇంటికి వెళ్ళిపోయింది. కాని మరుసటిరోజు న్యాయస్థానంలో ఆమె భర్తకు మరణ దండన విధించబడింది. అయినా తీర్పును మాత్రం అధికారికంగా మరుసటిరోజు వెల్లడిచేయగలమని న్యాయమూర్తి అన్నారు. మరల ఆ రోజు సాయంత్రం ఆ స్త్రీ బాబా వద్దకు వచ్చి ఏడ్చింది. బాబా ప్రేమగా నవ్వుతూ "ఎందుకమ్మా ఏడుస్తావు, నేనుండగా వాడినెవరేం చేయగలరు ?" అన్నారు. చిత్రం! మరునాడే ఆ శిక్ష ఉపసంహరించబడిందని న్యాయమూర్తి తెలిపారు.

ఒకసారి నాగపూర్‌కు సమీపాన ఉన్న సతరంజిపూర్ అనే ప్రాంతంలో హిందూ ముస్లింల పెద్ద కొట్లాట జరిగింది. కొందరు మరణించారు. ఎందరో గాయపడ్డారు. పోలీసులు రంగంలోకి దిగి ముస్లింలకు చెందిన కొందరిని నిర్బంధించి న్యాయస్థానంలో హాజరు పరిచారు. వారిలో ఒక వర్గానికి నాయకుడైన అబ్దుల్ సత్తార్ కోర్టుకి వెళుతుండగా ఆ రోడ్డుపై ఒక గుర్రపు బండిలో తాజుద్దీన్ బాబా వస్తుంటే చూసి పరుగున పోయి ఆయన పాదాలపై వ్రాలి తనను రక్షించమని ప్రార్థించాడు. "నేనూ కోర్టుకు వస్తాను. నువ్వు ముందుగా వెళ్లు" అని మాత్రం చెప్పి, బాబా బండిలో సాగిపోయారు. సత్తార్ కోర్టు చేరేసరికి న్యాయమూర్తి అప్పటికే తన స్థానంలో కూర్చున్నాడు. వాకిట్లో జవాను అతడి పేరును మూడు సార్లు కేక వేశాడు. సత్తార్ ప్రాణాలు పైనే పోయాయి. బతుకుపై ఆశ వదులుకొని బోనులో నిల్చి కన్నులు మూసుకొని బాబాను తలచుకొన్నాడు. తిరిగి అతను కళ్ళు తెరిచే సరికి జడ్జి గారి స్థానంలో బాబా కూర్చుని కనిపించి అతనిని రెండు మూడు ప్రశ్నలు వేశారు. అతని నోట వెంట అప్రయత్నంగానే సమాధానాలు వెలువడ్డాయి. కాని తానేమి చెబుతున్నాడో అతనికే తెలియలేదు. రెండు నిమిషాలలో అతడు నిర్దోషి అని నిర్ణయించబడినది. అతడెంతో సంతోషంతో బాబా బైటకు వస్తారని కోర్టు వరండాలో వేచి యున్నాడు. ఎంత సేపటికీ ఆయన బైటకు రాకపోయే సరికి అతడు కోర్టు హాలులోకి తొంగి చూశాడు. అక్కడ బాబా

ఇదంతా యథాస్థానంలో జట్టీ కూర్చొని వున్నారు. అప్పుడు కాని అందరికీ బాబా మాటలు అర్థం కాలేదు.

అబ్దుర్ హసన్ అనే యువకునికి అబ్దుల్ గఫూర్ అనే చిన్న తమ్ముడున్నాడు. ఆ చిన్న పిల్లవాడికి ఒక సంవత్సరం నిండకముందే భయంకరంగా జబ్బు చేసి మృత్యుముఖంలో వున్నాడు. ఆ పిల్లవాడిని తీసుకొని హసన్, అతని తల్లి బాబాను దర్శించారు. పిల్లవాడిని చూస్తూనే ఆయన హసన్‌తో "తమ్ముడా భగవంతుని నిర్ణయమలా వుంటే ఆ జీవిని పోనివ్వరాదా !" అన్నారు. ఆ తల్లి ఏడుస్తూ ఆయన పాదాలపై బడి, "పిల్లవాడి ప్రాణాలు ఎలాగయినా దక్కించు బాబా!" అంటూ ఏడ్చింది. "అది చాలా" అన్నారాయన. "ఆ పైన మీ దయ బాబా ! ఎలా వున్నా సంతోషమే" అన్నది ఆమె. ఆయన కళ్ళలో నీళ్ళు తిరిగాయి. హసన్ కేసి చూచి. "ఏది ఆ పుస్తకమిలా యివ్వు" అన్నారు. అతడు తన డైరీ తీసి ఆయనకందించారు. ఆయన అందులో "గఫూర్‌కు 20 సంవత్సరములు" అని వ్రాసి యిచ్చి ఇక పొండి "యిక్కడ నుండి" అని కసిరారు. తర్వాత ఆ పిల్లవాడికి ఆరోగ్యం చేకూరింది. సంపూర్ణమైన స్వస్థతతో 20 సంవత్సరములు జీవించాడు. 20వ సంవత్సరం పూర్తవుతూనే స్వల్పమైన అస్వస్థతతో ఆకస్మికంగా చనిపోయాడు. ఆనాడు బాబా వ్రాసినది తన డైరీలో మాసినా కాదని చిరస్థాయిగా నిల్చేదని కాలం నిరూపించింది

పరంధ్వంలో సారంగపాణి మొదలియార్ అనే పేదవాడుండేవాడు. అతడు ఆ పరిసరాలలో నాలుగైదు గ్రామాలలో పూలమ్ముకొని కుటుంబాన్ని పోషించుకునేవాడు. అతడెంతగా ప్రయత్నించినా కుమార్తెకు సరియైన పెళ్ళి సంబంధం కుదర లేదు. ఒకసారి అతడి అక్కగారు నాగపూర్ నుండి వచ్చి ప్రతి గురువారము ఉపవాసం, బాబా నామం స్మరిస్తే ఆయనే దయ చూడగలడని సలహా యిచ్చింది. అతడు ఆ ప్రకారం మూడు గురువారాలు చేసి ప్రతి మంగళవారం దానాలు చేస్తుండేవాడు. ఒక మంగళవారం వచ్చిన వారిలో ఒక సాధువు తాజుద్దీన్ బాబాను ఎంతగానో పోలి యున్నాడు. సారంగపాణి ఆయనకు దానమిచ్చి, "స్వామీ మీకు పూలు సమర్పించాలనుకొన్నాను. కాని అవి ఎండిపోయాయి" అని బాధపడ్డాడు. "అవి ఎండిపోలేదు. తాజాగా వున్నాయి చూడు" అన్నారా

సాధువు. అవి తక్షణమే దాదా పుష్పాలుగా మారిపోవడం చూసి ఆశ్చర్యపోయాడు. అంతటి మహనీయుని ఆశీర్వచనం తన కుమార్తెకు ఇప్పించాలని ఇంటిలో నుంచి ఆమెను పిలుచుకొచ్చేసరికి ఆ సాధువు ఎక్కడా కనబడలేదు. ఆ మరునాడే సికింద్రాబాదు నుండి ఆ ఊరికి వచ్చిన ఒక కుటుంబం పరిచయమై అతడి కుమార్తెను చూస్తూనే ఆమెను వారబ్బాయికి వివాహం చేసుకోవడానికి నిశ్చితార్థం చేసుకొన్నారు. త్వరలో వివాహం కూడా అయింది

బాబా దగ్గరకు సంతానం లేని వారు కూడా ఆశీర్వచనం కోసం వచ్చేవారు. అలా వచ్చిన ప్రతి వారు ఆయన ఆశీర్వచనం వల్లనే వారికి సంతతి కల్గిందనే దానికి ప్రతి సంఘటనలోనూ తగినన్ని ఆధారాలు వుండేవి

## సంతానం లేని వారికి సంతానం

ఒకసారి బాబా నది ఒడ్డు మీద కూర్చుని వుండగా అమరావతి నుండి ఇద్దరు స్త్రీలు బాబా దర్శనార్థం వచ్చారు. గౌరవపూర్వకంగా బాబాకు నమస్కరించాక ఆ స్త్రీలు తమకు సంతానం లేని విషయాన్ని వ్యక్తపరిచారు. వారి వివాహాలై 12, 13 సంవత్సరాలయినప్పటికీ సంతానం కలుగలేదు. వారి కోరికను విని తాజుద్దీన్ బాబా భక్తులు సమర్పించిన నివేదనలోంచి రెండు లడ్డూలు తీసి చెరొక లడ్డు ప్రసాదంగా ఇచ్చారు. అందులో ఒకామె భక్తి శ్రద్ధలతో ఆ ప్రసాదాన్ని అప్పటికప్పుడే తినేసింది. రెండవ స్త్రీకి బాబా యందు అంతగా విశ్వాసం లేదు. అందుచేత ఆమె ఆ లడ్డును నేర్పుగా క్రింద పడవేసి ఎవరూ దానిని గమనించ వీలు లేకుండా ఇసుక కప్పి వేసింది. బాబా దగ్గర కొంత సేపు గడిపాక ఆ ఇద్దరు స్త్రీలు అమరావతి వెళ్ళిపోయారు. ఒక సంవత్సరం గడిచాక లడ్డు తిన్న స్త్రీకి మగశిశువు జన్మించాడు. కాని తనతో పాటు బాబా ఆశీర్వచనం పొందిన తోటి స్త్రీకి సంతానం కలుగకపోవడం ఆమెకు ఆశ్చర్యం కలిగించింది. కొంత కాలానికి ఆ ఇద్దరు స్త్రీలు మళ్ళీ ఒకసారి తాజుద్దీన్ బాబాను చూసి వద్దామను కున్నారు. మాతృత్వాన్ని పొందిన స్త్రీ బాబా తనకు శిశువు ప్రసాదించినందుకు కృతజ్ఞత తెలుపుకుని తన శిశువు బాబా ఆశీస్సులు పొందడం కోసం బాబా దర్శనార్థం బయలుదేరింది. దురదృష్టవంతురాలైన రెండవ స్త్రీకి హృదయంలో

అన్నాడు. అబ్దుల్‌హసన్ తండ్రి బాబా దగ్గరే పిల్చుస్ వున్నాడు. ఆయనతో బాబా ఆ ఖైదీని వంట ఇంట్లోకి తీసుకుపోయి అక్కడ వండి వున్న దాంతో భోజనం పెట్టమని ఆజ్ఞాపించారు. బాబా ఆజ్ఞలోని తీవ్రతను చూచి ఆయనకు వాన వల్ల పొయ్యి ఆరిపోవడంతో వంటంతా నిలిచిపోయిందని చెప్పటానికి అతనికి ధైర్యం చాల లేదు. మాట్లాడకుండా ఆయన ఖైదీని తనతో వంట గదిలోకి తీసుకువెళ్లాడు. అతను అన్నపు గుండిగ మూత తెరచి చూచే సరికి అన్నం చక్కగా ఉడికి వుంది. నిప్పు,మంట లేని పొయ్యి మీద పదార్థాలన్నీ చక్కగా వుడికి వుండటం ఎవరందరి ఆశ్చర్యానికి అంతు లేదు. ఆ ఖైదీ ఒక్కడే కాక అక్కడ చేరిన వారంతా కడుపుల దాకా భోజనం చేశారు. తర్వాత ఎందుకు ఉరిశిక్ష విధించబడిందో అడిగినప్పుడు ఆ ఖైదీ అతని నౌకర్లలో ఒకడు తన కూతురితో అక్రమ సంబంధం పెట్టుకున్నందు వల్ల అతనిని కొట్టాననీ, ఆ నౌకరు చనిపోయాడనీ, అందువల్ల తనకా శిక్ష పడిందనీ చెప్పాడు. అది విన్న తాజుద్దీన్ బాబా అతనిని పై కోర్టుకు అప్పీలు చేసుకోమనీ, విడుదల లభించగలదనీ చెప్పారు. అతను అలాగే చేసి జైలు నుండి విడుదల పొందాడు

## రఘోజీ మహరాజ్ భక్తి

బాబా చూపించే అద్భుత మహిమలను లెక్కించ సాధ్యం కాదు. లెక్కలేనంత మంది భక్తులు వాకీలో బాబా వద్దకు రోజూ వచ్చి ఆయన ఆశీర్వచనాలు పొందేవారు. బాబాకు ముఖ్యులైన భక్తులలో నాగపూరును పాలించిన రఘోజీ రావు భోంస్లే ఒకరు. ఆయన ఎన్నో సార్లు బాబాను దర్శించి తన రాజభవనంలో వుండమని కోరేవాడు. కానీ బాబా ఆ విషయం పట్టించుకొనేవారు కాదు. ఆయన మరొకసారి వాకీ వచ్చి బాబాను తన రాజభవనంలో వుండాల్సిందిగా కోరాడు. ఇంతకు ముందు ఆయన రెండు సార్లు హిందువుల ఇండ్లను తన నివాసంతో పావనం చేశారు. మొదటిసారి 'లాలకోటి' లో వున్నప్పుడు, రెండవ సారి పటేల్ కాశీనాథ్ తో వున్నప్పుడు. ముస్లిం మహాత్ముడైన తాజుద్దీన్ బాబా హిందువుల భవనంలో నివసించడం ఇది మూడవ సారి. బాబా అలా చేయటానికి గల కారణాలు ఆలోచిస్తే మనకు తెలుస్తాయి. తాజుద్దీన్ బాబా అంటే భౌతికంగా కన్పించే ఆయన శరీరం మాత్రమే కాదు. అన్ని జీవాలకూ మూలమైన ఆత్మతత్త్వమే ఆ మహాత్ముడి నిజస్వరూపం. మనుష్యులు

స్వీకరించుకున్న మత భేదాలను ఆయన అధిగమించారు. ఇంతకు ముందే మనం తెలుసుకున్నట్లు బాబా బాల్యంలో ఆయన హృదయానికి హత్తుకుపోయిన సూఫీ మహాత్ముల దివ్యపథ ఆయనపై చెరగని ముద్ర వేసింది. ఆ దివ్యపథ మత భేదాలను అధిగమించమని ఆయనకు ప్రబోధించింది. ఆయన అట్టి స్థితిని సాధించారు కూడా. బాబా హిందువుల ఇళ్ళలో నివసించడం వంటి చర్యలలోని ఆంతర్యం ఎరుగని పామరులైన ముస్లింలను ఆశ్చర్యంలో ముంచినట్లే, హిందువైన రఘూజీరావ్ ముస్లిం ఫకీర్ అయిన బాబాను ఆరాధించడం కూడా పామరులైన హిందువులను అలాగే ఆశ్చర్యంలో ముంచింది.

ఏమైనప్పటికీ మహరాజ్ తాజుద్దీన్ బాబా యీ సారి ఏరాశ వదలకుండా రాజ భవనంలో వుండడానికి అంగీకరించారు. మహారాజా బాబా కోసం భవనమే కాక ఒక గుర్రం బండినీ, కొంత మంది సేవకులనూ ఆయన అవసరాలను చూడడానికి కోసం నియమించారు. నియమంగా రఘూజీరావు కూడా బాబాను సేవించేవాడు. తాజుద్దీన్ బాబా జీవితంలోని యీ మలుపులో ఆయన కీర్తి మరింత వ్యాపించింది.

## వింత స్వభావం

1916వ సంవత్సరంలో బాబాను దర్శించిన వారిలో యేవత్మల్ జిల్లాలోని పుసద్ అనే గ్రామానికి చెందిన దింపేల్కర్ ఒకడు. తాజుద్దీన్ బాబా ఉగ్రమైన స్థితిలో సమీపించిన వారిపై మండుతూ వున్న కట్టెలను, రాళ్ళనూ విసిరేవారని, అప్పుడప్పుడూ బాహ్యస్మృతిని కోల్పోయేవారని, తలచిన వెంటనే పిచ్చైన ఆవేశంతో వుండేవారని, ఆయన ఒక్కొక్కసారి భక్తులు సమర్పించిన గుడ్డలకు నిప్పంటించే వారని, ఆయన ఎందుకు చేసేవారో తెలియదని, ఎవరికీ ఆయనను కారణం అడిగే ధైర్యం వుండేది కాదని దింపేల్కర్ చెప్పాడు. ఈ వింత ప్రవర్తనతో తాజుద్దీన్ బాబా శిరిడీ సాయిబాబాను పోలి వుండేవారు. కొన్ని కొన్ని సందర్భాలలో యీ మహాత్ములు తమకున్న ద్వేషమంతా వ్యక్తులలోని అంతః శత్రువులైన బలహీనతల పట్లేనని, పైకి కనిపించే వారి ప్రవర్తన దానికి చిహ్నమేనని తెలియచేసి వున్నారు. ఎందుకంటే వారి అటువంటి వైఖరులు వ్యక్తులలోని బలహీనతలను నశింపజేసేంతటి ప్రభావాన్ని కల్గి వుండేది.

## ఇద్దరూ భక్తులే

అన్ని మతాలలోనూ జీవులు తాము చేసిన పాపాలకు నిజమైన పశ్చాత్తాపం పొందినట్లయితే వారికి దైవం యొక్క రక్షణ ఎప్పుడూ వుంటుందని చెప్పబడి వున్నప్పటికీ జీసస్ క్రీస్తు అటువంటి వారికి రక్షణ కల్పించడంలో ప్రఖ్యాతి గాంచారు.

కానీ తాజుద్దీన్ బాబా భక్తులకు ఆధ్యాత్మిక శ్రేయస్సు చేకూర్చడమే కాక యితరుల అవినీతి వల్ల నష్టానికి గురైన భక్తులకు ఆ నష్టాన్ని సహితం పూరించే వారన్న క్రింది సంఘటన వల్ల తెలుస్తుంది. ఒకసారి మిఠాయి దుకాణం నుండి మిఠాయిని కాజేసిన దొంగ ఒకడు తాజుద్దీన్ బాబా దగ్గరకు పరిగెత్తుకుంటూ వచ్చి నిజమైన పశ్చాత్తాపంతో ఆయనను శరణువేడాడు. బాబా అతని కళ్ళలోకి తీక్షణంగా కొద్దిసేపు చూశాక "నువ్వు వచ్చిన పని పూర్తయింది. ఇక వెళ్ళు" అన్నారు. అతను వెళ్ళిన కొద్ది సేపటికి ఆ మిఠాయి దుకాణాదారు వచ్చి తన షాపును కొల్లగొట్టారని, తనకు చాలా నష్టం వచ్చిందని బాబాకు విన్నవించు కున్నాడు. బాబా అతనితో శాంతంగా "నీవు యింటికి వెళ్ళి కూర్చో" అన్నారు. మొదట తాజుద్దీన్ బాబా తన విన్నపాన్ని అంగీకరించారో లేదోనని సందేహించా డు. అయినా బాబా ఆజ్ఞానుసారం చేయటం కంటే గత్యంతరం లేదు గనుక తిరిగి వెళ్ళి షాపులో కూర్చొని దొంగిలించుకపోగా రెండు బుట్టల నిండుగా మిగిలి వున్న మిఠాయిలను అమ్మడం ప్రారంభించాడు. ఆశ్చర్యకరంగా అతను ఉదయం నుండి సాయంత్రం వరకు అమ్ముతున్నప్పటికీ ఆ బుట్టలో మిఠాయిలు యింకా మిగిలే వున్నాయి. అతనికి వచ్చిన నష్టమంతా భర్తీ అయింది. అప్పటి నుండి అతని వ్యాపారం రోజు రోజుకూ అభివృద్ధి చెంది, దైవకృప బాబా ఆశీర్వచనాల వలన అతను వేలకు వేలు లాభాలు సంపాదించాడు.

## సూఫీ ఫకీర్ శక్తి

ఈ సూఫీ మహాత్ముని (తాజుద్దీన్ బాబా) దివ్యశక్తులు ప్రకృతి శక్తులను సైతం శాసించగలిగేంతటి మహిమను కలిగి వుండేవి. మనం యింతకు ముందుగా చదివినట్లు నిప్పులేని పొయ్యి మీద బాబా ఆజ్ఞాపించినంత మాత్రాన్నే

పంటంతా ఎలా తయారయింది ' అలాగే ఒకసారి వ్యవసాయదారు లంతా తాజుద్దీన్ బాబా దగ్గరకు వచ్చి, వర్షాలు యింకా కురవలేదని, సమయం మించి పోతున్నదనీ సకాలంలో వర్షం వచ్చేటట్లుగా చేయమని ప్రార్థించారు. అప్పుడు తాజుద్దీన్ బాబా ఒక కుండనిండుగా నీరు తెమ్మని ఆజ్ఞాపించారు. ఆయన ఐదు నిముషాలు సేపు కొద్దికొద్దిగా నీటిని ఆయన ప్రక్కనున్న గొయ్యిలో చల్లారు. వెంటనే ఆకాశం మేఘావృతమైంది. కావలసినంత వర్షం కురిసింది. ఆ వర్షం యిప్పుడు శాస్త్రవేత్తలు తమ యిష్టానుసారం వర్షం కురిపించడానికి చేసే ప్రయోగాల ప్రదర్శన వంటిది కాదు, అది నిజంగా దైవ మహిమే

బాబా సకర్‌దరా రాజభవనంలో వుండగా ఆయన ఎంతో మంది చనిపోయిన వారిని తిరిగి బ్రతికించడం చాలామంది చూశారు. అటువంటి అనుభవం వలనే నాగపూర్ జైలు రోడ్డులో వుండే రామ్‌గులామ్ పాండే తాజుద్దీన్ బాబా భక్తుడయ్యాడు. అతను పంజాబ్ నుంచి మేలుజాతి బర్రెపోతదాన్ని తెచ్చుకున్నాడు. ఆ పశువంటే అతనికి చాలా ఇష్టం. అది త్వరలోనే సంతతిని పొందుతుందని ఆశలు పెట్టుకున్నాడు. కొంత కాలానికి దానికి ఒక దూడ కలిగింది. కాని ఆ దూడ పుట్టిన వెంటనే చనిపోయింది. రామ్‌గులామ్‌కు చాలా నిరాశ కలిగింది. పొరుగున వున్న వారిలో ఒకరు, ఆ దూడను తాజుద్దీన్ బాబా దగ్గరకు తీసుకు పొమ్మని, ఆయన బ్రతికిస్తారనీ ఎగతాళిగా అన్నారు. రామ్‌గులామ్ అందుకు సందేహిస్తుండగా, తాజుద్దీన్ బాబా తానే బగ్గీలో అక్కడికి వచ్చారు. బండి దిగి చనిపోయిన దూడ దగ్గరకు వచ్చి దాన్ని కాలితో ఒక్క తన్ను తన్నారు. ఆశ్చర్య కరంగా అది వెంటనే లేచి నుంచుంది. ప్రేక్షకులందరినీ విభ్రాంతిలో ముంచి బాబా అక్కడ నుంచి వెళ్ళిపోయారు.

ఏసుక్రీస్తు చేసిన యిలాంటి మహిమలను విన్నప్పుడు కలియుగంలో కూడా యిటువంటి మహిమలు జరగడం సాధ్యమేనా ' అని ఆశ్చర్యం కలుగుతుంది. కాని 50 సంవత్సరముల క్రితమే తాజుద్దీన్ బాబా జీవితంలో ఆయన చేసిన వేలాది మహిమలను లక్షల మంది ప్రజలు చూశారు. భారతీయ మహాత్ములంతా అటువంటి లీలలు అసంభవం కాదని నిరూపించి చూపడం ఆధునిక శాస్త్రజ్ఞు లందరికీ కనువిప్పు కాగలదు.

వచ్చాడు

తాజుద్దీన్ బాబా దర్శనార్థం అంగవైకల్యం గల కుటుంబాలెందరో వచ్చి చక్కబడి పోయేవారు. ఒకసారి ఢిల్లీకి చెందిన ధనవంతుడైన మార్వాడీ సేఠ్ సకుటుంబంగా వచ్చాడు. అతని కాళ్ళు రెండూ ఏమీ ఉపయోగం లేకుండా శరీరం నుండి వ్రేలాడుతూ వుండేవి. అతను బాబా దగ్గరకు రావడానికి మోయవలసి వచ్చింది. అప్పుడు బాబా చాలా కోపావేశంలో వున్నారు. ఆయన సేఠ్‌ను, "ఓరి దుష్టపోతా! నువ్వు నా దగ్గర నాటకాలాడుతావా! ఇక్కడ నుండి పరుగెత్తు" అంటూ కాలితో ఒక్క తన్ను తన్నారు. బాబా యొక్క యీ తిరస్కార వైఖరికి భయపడిపోయి జీవితంలో అతను మొదటిసారిగా లేచి నుంచున్నాడు. బాబా యింకా శాంతించక, "నేచెప్పిందినీకు వినపడ్డం లేదా ? నేను చెప్పినట్లు చేయక పోతే చంపుతాను జాగ్రత్త. నేను పరుగెత్తమని చెప్పాను. ఈ పరుగెత్తు లేకపోతే తంతాను" అన్నారు. వెంటనే ఆ సేఠ్ బలంకొద్దీ పరుగెత్తాడు. బాబా చేసిన యీ అద్భుతమైన లీలకు అందరూ ఆశ్చర్యపోయారు.

## డిప్యూటీ కమీషనర్ అనుభవం.

తాజుద్దీన్ బాబా చేసే మహిమలు ఎన్నో రకాలుగా వుండేవి. బహదూర్‌సాల్ తివారీ అనే ఆయన సోదరుడు గొప్ప హకీమ్. (యునానీ వైద్యుడు). ఆయనను నాగపూర్‌లో డిప్యూటీ కమీషనర్‌గా నియమించారు.ఒక రోజున ఆ హకీమ్ గారిని ఆయన సోదరుడైన తివారీ తాజుద్దీన్ బాబాను సేవించడం కోసం సకుటుంబంగా తీసుకువచ్చాడు. తర్వాత ఆ హకీమ్ అక్కడ నుండి సాగర్ వెళ్ళి ముగ్గురు సాధువులను కలుసుకున్నాడు. మాటల సందర్భంలో తాజుద్దీన్ బాబా మహిమల గురించి, ఆయన గొప్పతనం గురించి డిప్యూటీ కమీషనర్ ఆ సాధువులతో చెప్పాడు. వారు హిందూ సాంప్రదాయానికి చెందిన వారవడం వల్ల ముస్లిం మహాత్ముని మహిమలను గురించి ఆసక్తి చూపలేదు. తాజుద్దీన్ బాబా ఒక హిందువుకు శ్రీరాముడిగా శంకరుడిగా దర్శనమిచ్చిన సంగతి కూడా డిప్యూటీకమీషనర్ ఆ సాధువులతో చెప్పినా వారికి ఆయనయందు లక్ష్యం కలుగలేదు.

## అత్యున్నత స్థాయిలో బాబా ప్రతిష్ఠ

1920-25 సంవత్సరాల కాలంలో బాబా కీర్తి నలుదిశలకూ వ్యాపించి గొప్ప సూఫీ మహాత్మునిగా ఆయన ప్రతిష్ఠ అత్యున్నత స్థానాన్నందుకున్నది. లక్షలాది ప్రజలు ఆయన దర్శనార్థం వచ్చేవారు. మహారాజా రఘోజీరావు ఎప్పుడూ ప్రజావాహిని బాబాను దర్శించడానికి వీలుగా అన్ని సౌకర్యాలు సమకూర్చేవాడు. బాబాకు భక్తులు సమర్పించే గుడ్డలు ఇతర కానుకలూ అందరికీ పంచేసేవారు. ముఖ్యంగా రంజాన్ నెలలో వాటినన్నింటినీ పేద ప్రజలకు పంచేవారు. బాబాకు సమర్పించే డబ్బు ఇతర కానుకలలో ఎక్కువ భాగం బాబా మామగారైన అబ్దుల్ రహమాన్ షాకు, బాబాకు దగ్గిర బంధువైన జబ్బార్ అనే ఆయనకు అందేటట్లు చూచేవారు. కొంత భాగం ఆయన సేవకులకు ఇచ్చేవారు. ఇంకా మిగిలినదంతా బాబా స్థలానికి భోజనశాలకూ పంపేవారు.

## వివాద కారణము

అయితే దురభిప్రాయపడిన కొందరు ముస్లిములు బాబాకు వచ్చే డబ్బు ఖరీదైన కానుకలు రఘోజీరావ్ మహారాజ్ చేతుల మీదుగా ఖర్చు పెట్టబడుతుండడం చూచి అసూయ చెందారు. తాజుద్దీన్ బాబా రాజ భవనంలో వున్నందువలనే కదా డబ్బంతా రఘోజీరావ్ చేతుల్లోకి వెళ్తున్నది అని తలచి బాబాను ఎలాగైనా సరే రాజభవనం నుండి బయటకు రప్పించి తమ పర్యవేక్షణలో వుంచుకోవాలని తలచారు. అందుకోసంగా వారు మత కలహాలను రెచ్చగొట్టడానికి కూడా వెనుకాడలేదు. తాజుద్దీన్ బాబా తన దివ్యలీలల ద్వారా బాహ్యంగా మనుషులేర్పరచుకున్న వివిధ మత విధానాలు కుల వర్గ విచక్షణలూ ఆధ్యాత్మిక పురోగతి ద్వారా భగవంతునితో ఐక్యత సాధించటానికి యేమీ సహకరించజాలవని ప్రకటిస్తున్నప్పటికీ చారిత్రాత్మక విలువ గల అటువంటి నైతిక బోధల పట్ల స్వార్థపరులైన కొందరు ముస్లిములకు గౌరవమే లేకపోయింది. ఇటువంటి మూర్ఖులే జీసస్ క్రీస్తును ఆణివాళ్ళు పెట్టినపుడు ఆయన తన తండ్రి అయిన భగవంతునితో, "తండ్రీ వీరి తప్పులన్నింటినీ క్షమించు. వారేం చేస్తున్నారో వారికే తెలియదు" అని ప్రార్థించడం స్మరించదగినది.

ఈ వివాద పరిస్థితిలో ముస్లిం సోదరుల మొండి కోరిక ఏమిటంటే తాజుద్దీన్ బాబా నివసించే దర్గా మీద ముస్లిం మత చిహ్నాన్ని ఏర్పాటు చేయడం, తర్వాత ఇతరులకూ మస్జీదులు. హిందువులు గూడా బాబాను దర్శించి ఆయన ఆశీర్వచనాలను పొందుతూ వున్నారు. ఒక మీదట ఆయన దర్శన ఆశీర్వచనాలను ముస్లింలు వరకే పరిమితం చేయడం వంటి సంకుచితమైన చర్యల వలన బాబా ప్రవచించుచూవిన పవిత్ర ఆదర్శాలకే భంగం కలుగుతుందని వారు తలచేరు. క్రమంగా అబ్దుల్ రహమాన్ షా, జబ్బార్ గూడా వారి ఆలోచనలతో ఏకీభవించారు. అందుచేత 1936వ సంవత్సరంలో నాజర్‌ఖాన్ అనే ఆయన అధ్యక్షుడుగా యూసఫ్ (బారిష్టర్) కార్యదర్శిగా ఒక సంస్థ ఏర్పాటు చేయబడింది. తాజుద్దీన్ బాబాకు ముఖ్యమైన భక్తులుగా చెల్లడి కాగోరిన వారందరూ అందులో సభ్యులుగా చేరారు. వారి దృష్టిలో ముస్లిం ఫకీరు మాత్రమే అయిన తాజుద్దీన్ బాబాను తనకు తాను ఆయన సేవకుడిగా మాత్రమే భావించు కొనే రఘూజీ మహారాజ్ ఏ అధికృతా లేని హిందువు మాత్రమే ! వారి ప్రధాన ఆశయం తాజుద్దీన్ బాబాను ఆయన రాజభవనం నుండి బైటకు తీసుకు వెళ్ళటమే. ముఖ్యంగా వారి దృష్టి అంతా బాబాకు భక్తులు సమర్పించే కానుకలను చేజిక్కించుకోవాలనే.

సహజంగా ఇటువంటి వివాదాలు, వాటి పరిణామము రఘూజీ మహారాజ్ హృదయాన్ని వికలం చేశాయి. అయినా ఆయన నమ్మకంగా బాబాను సేవించడం మానలేదు. ఒకరోజున బాబా రఘూజీరావ్ గారితో, "నన్ను యిక్కడనుండి. నీ నుంచి దూరంగా ఎవరు తీసుకెళ్ళగలరు ? నా పని నీ ఇంట్లోనే కొన్ని లక్షల సంవత్సరాల వరకూ ఉంటుంది" అంటూ ఆయన వ్యథను తొలగించారు. ఆయన ప్రసాదించిన అభయానికి ప్రతిఫలంగా నేటికీ లాల్‌కోఠీలో తాజుద్దీన్ బాబా వున్న మందిరం పవిత్రంగా వుంచబడి భద్రపరచబడింది. తాజుద్దీన్ బాబా భౌతికంగా అక్కడ లేనప్పటికీ ఆయన సమాధి అయిన తరువాత కూడా ఆ మందిరంలో జరిగే అద్భుత మహిమల వల్ల బాబా రఘూజీరావుకి యిచ్చిన వాగ్దానాన్ని నెరవేరుస్తున్నారని మనకు స్పష్టమవుతున్నది. మత మౌఢ్యంలో మునిగి వున్న కొందరు ముస్లింలకు నచ్చినా నచ్చకపోయినా మానవుడు సృష్టించుకొన్న

యా భేదాలకు అతీతమైన స్థితిలోనే ఆయన ఎప్పుడూ వున్నారు. ఒక్క మాటలో చెప్పాలంటే తాజుద్దీన్ బాబా జాతి, కుల, మత, భేదాలకు పరిమితం కాకుండా మానవజాతిలోని దుఃఖాన్ని తొలగించడానికి అవతరించిన దైవాంశ సంభూతుడు.

అయితే ఈ వివాదం కోర్టు దాకా వెళ్ళింది. ముస్లిములు తాజుద్దీన్ బాబా మహారాజ్ భవనంలో వుండడానికి అభ్యంతరం పెట్టారు. ఈ వివాదాల మధ్య ఉదయించిన సంఘర్షణను తగ్గించడానికా అన్నట్లు ఆయన పురపాలక సంఘానికి చెందిన ఒక కోర్టు కూడలిలో వేసిన టెంటులో వుండసాగారు.

## అధ్యాయము - 3

## మహా సమాధి

### తాజ్ - ఉల్ ఆరిఫిన్

1924లో ఒకరోజు తాజుద్దీన్ బాబా నాగపూర్‌లోని ధంతోలి రోడ్డులో నడుస్తూ రోడ్డు ప్రక్కగా వున్న ఒక చిన్న వంతెన మీద కూర్చున్నారు. ఎప్పటి లాగానే ఆయన చుట్టూ కొద్ది సేపటికి జనం గుమిగూడారు. అప్పుడు బాబా భక్తుడైన కరీమ్ బాబా అని పిలువబడే షేక్ కరీముద్దీన్ తాజీ అనే ఆయన కూడా ఆయన ప్రక్కనే వున్నారు. కాసేపయ్యాక తాజుద్దీన్ బాబా కరీమ్ బాబాను యిలా అడిగారు! "తాజ్-ఉల్-ఆరిఫిన్ (సూఫీ యోగులందరికీ గురువైనవారు), ఎవరు ?" వెంటనే కరీమ్ బాబా "మీరు కాకఇంతటి వారు యింకెవరున్నారు"? అన్నారు. అప్పుడు తాజుద్దీన్ బాబా నిశ్చయంగా, "అవును నేనే" అన్నారు. తరువాత ఆయన కన్నులు రెండూ మూసుకొని, "ఓ! ఈద్ చంద్రుడు దర్శనమిస్తున్నాడు" అన్నారు.

కరీమ్‌బాబా ఈద్ పండుగ చాలా రోజుల క్రితమే అయిపోతే ఇప్పుడు ఈద్ చంద్రుడు దర్శనమివ్వడమేమిటా అని ఆశ్చర్యపోతూ, "స్వామీ ! రంజాన్ మాసమంతా గడిచిపోయింది. ఇప్పుడు దర్శనమిస్తున్నది బక్రీద్ చంద్రుడు కదా!" అన్నారు. అందుకు బాబా "ఈద్ చంద్రుని నేనింక చూడలేను" అని నొక్కి పలికారు. చాలారోజుల తరువాత గాని తాజుద్దీన్ బాబా సంకేతంగా పలికిన

ఆ మాటలు భక్తులకు అర్థం కాలేదు. ఆ మాటలలో ఆయన తాము పరమాత్మలో ఐక్యం కాబోతున్నామని సూచించారని భక్తులు తరువాత గ్రహించారు.

### అనారోగ్యం

1924 జులై మాసం సమీపిస్తున్న సమయంలో బాబాకు జబ్బు చేసింది. పది రోజులు గడిచినా ఆయన కోలుకోలేదు. రోజు రోజుకూ క్షీణిస్తూ ఆయన యిదివరకటి లాగా బయటికి కదలలేక పోయారు. మహారాజ్ రఘోజీ బాబా ఆరోగ్య పరిస్థితి నానాటికీ అలా వుండటం వల్ల చాలా కలత చెందారు. ఆయన తరచుగా తాజుద్దీన్ బాబా దర్శనానికి రావడమారంభించారు.

కొందరు మతభ్రష్టులు సృష్టించిన మత వైషమ్యాలు తీవ్రరూపం దాల్చి అలాగే కొనసాగుతున్నాయి. బాబాభక్తులయిన ముస్లింలు కొందరు బాబా కూర్చున్న ప్రాంతంలో రోడ్డు ప్రక్కనే నివసించసాగారు. అయితే వారు ఆక్రమించిన భూములు ఇతరుల స్వంత ఆస్తులవడంతో వారు ముస్లింలను అక్కడ వుండనీయలేదు. తరువాత వారు నియాజుద్దీన్ వారికి యిచ్చిన స్థలంలో స్థిరనివాస మేర్పరచుకున్నారు. తాజుద్దీన్ బాబా ఆజ్ఞను పొంది మొదటగా కోలంబాబా అక్కడే ఒక కట్టడాన్ని ఆరంభించారు. చాలా మంది సహకారంతో త్వరలో అక్కడ వెలసిన "తాజ్–అబాద్–షరీఫ్" అనే కట్టడం నిర్మించబడింది. మహారాజ్ భవనంలో ప్రతిరోజూ సూర్యోదయాన్ని సూచిస్తూ మ్రోగించబడే గంటను తాజుద్దీన్ బాబా ఇక నుంచి తాజ్–అబాద్–షరీఫ్ నుంచి మ్రోగించవలసిందిగా ఆజ్ఞాపించారు. ముస్లిం భక్తులు కూడా అక్కడే ఒక మసీదును నిర్మించారు. బాబా ఒకసారి వెళ్ళి మసీదులో కూర్చొని కొంచెం ఆహారం తెమ్మని భక్తులను కోరారు. భక్తులందరూ తలా కొంత తినుబండారాలను తెచ్చి బాబా ముందు వుంచారు. అయితే బాబా చాలా కొద్దిగా మాత్రమే తిని మెల్లిగా పట్టణం వైపుగా రోడ్డు మీద నడవడమారంభించారు. నడుస్తూ నడుస్తూ ఆయన ఆగి, ఒక ఖాళీగా వున్న ప్రదేశంలోకి వెళ్ళి కూర్చున్నారు. ఆయన అక్కడి మట్టిని చేతి నిండా తీసుకొని వాసన చూచారు. తర్వాత ఆయన "ఈ మట్టి చాలా మంచిది. మీరంతా ఇక్కడ నాకొక భవంతిని కట్టిస్తే చాలా బాగుంటుంది" అని ప్రకటించారు.

మళ్ళీ ఒక్క క్షణకాలం తర్వాత ఆయన, "వద్దు ! వద్దు ఒక పూరి గుడిసె మాత్రమే బాబా నాకు" అన్నారు.

తర్వాత రోజుల్లో తాజుద్దీన్ బాబా ఆరోగ్యం క్రమంగా క్షీణించసాగింది. ఆయన సాయంకాలాలను విరామంగా గడుపసాగారు. అప్పుడు పవిత్రమైన బక్రీద్ మాసం ప్రారంభమయింది. ప్రతి సంవత్సరమూ బక్రీద్ చంద్ర దర్శన సమయంలో భక్తులంతా బాబాకు సరికొత్త కఫ్నీని సమర్పించుకోవడం పరిపాటి. ఆ రోజు ఆయన కొత్త కఫ్నీతో బాటు కొత్త లుంగీని కూడా ధరించి, తన దగ్గరకు రాలేని భక్తులు కూడా తనను దర్శించుకొనడానికి నాగపూర్ పుర వీధులన్నీ తిరుగుతూ తన దర్శనాన్ని పుర ప్రజలకు అనుగ్రహిస్తారు. అయితే ఈ సారి మాత్రం ఆయన తనకు కొత్త వస్త్రాలు సమర్పించవద్దని కఠినంగా భక్తులను శాసించారు. ఆయన ఆ రోజు బయటకు రాలేదు కూడా. మొహరం నెల ప్రవేశించే దాకా ఆ మాసమంతా సందేహాస్పదమైన వాతావరణంలోనే గడిచిపోయింది.

## కర్బలాకు ఊరేగింపు

ప్రతి సంవత్సరమూ మొహరం నెల 10వ రోజున తాజుద్దీన్ బాబా ఆకుపచ్చని జుబ్బాను ధరించి "కర్బలా" కు వెళ్ళేవారు. (ఇమాం హుసేన్ గారి పుణ్యతిథియైన మొహరం మాసం పదవ రోజున ముస్లింలు తాజియాలను సాగి పెడతారు).

కర్బలా వద్ద 10 రోజుల సంతాపానంతరం తాజియాలను సమాధి చేసి తమ మతానుసారం ముస్లింలు వేడుకలు చేస్తారు. ప్రతి సంవత్సరం జరుపుకునే ఈ పండుగనాడు, తాజుద్దీన్ బాబా భక్తుడుగా తప్ప తనను తాను అధికంగా చూపుకోని మహరాజ్ రఘోజీరావు కూడా బాబాతో పాటు, తన పరివారమంతటి తోనూ సకల రాజ లాంఛనాలతో ఆ ఉత్సవంలో పాల్గొనేవారు. మొదట రఘోజీ మహరాజు తన పట్టపుటేనుగుపైన వెళ్ళేవారు. ఆయన వెనుక ఆయన పరివార మంతా వచ్చేవారు. తరువాత తాజుద్దీన్ బాబా, ఆయన వెంట (ముర్షిద్లు) శిష్యులు, భక్తులూ వారి వెనుకగా మిగిలిన ప్రజానీకమూ వెళ్ళేవారు. అయితే ఈ సంవత్సరం అలా గాక తాజుద్దీన్ బాబా షకర్దరా తోటమాలుల వద్దకు వెళ్ళారు.

అక్కడే ఆయన ఒక పటేల్ దగ్గర నుండి ఒక కాగితాన్ని తీసుకొని తన చేతిని పైకెత్తి అందులో వ్రాసిన ప్రార్థనను గట్టిగా చదివారు. ప్రార్థన పూర్తి అవటం తోనే ఆయన తీవ్రంగా ధ్యానంలో మునిగిపోయినట్లు కనిపించారు. వెంటనే ఆయన ప్రవర్తనలో పూర్తి మార్పు కనిపించింది. చుట్టూ వున్న భక్తుల వారిని కీర్తిస్తూ "హసనే హుసేన్" అంటూ పవిత్రమయిన నామాలను గట్టిగా ఉచ్చరించారు. తాజుద్దీన్ బాబా కాసేపటి తరువాత తన బసకు వెళ్ళిపోయారు.

రోజురోజుకీ క్షీణిస్తున్న బాబా ఆరోగ్య పరిస్థితి వల్ల ఎప్పుడు ఏం జరుగుతుందో ఏమోనని భక్తులంతా ఆందోళనతో రోజులు గడుపుతున్నారు. అప్పుడు తాజుద్దీన్ బాబా తన ప్రసంగాలలో తన నిర్యాణం దగ్గరలోనే వున్నట్లు సూచిస్తూనే వున్నారు. ప్రసిద్ధి పొందిన వైద్యులైన జాఫర్ హుసేన్, దర్యాపూర్ నుంచి వచ్చినవారు ఆయనను పరీక్షించి ఆయన రుగ్మత ఏమిటో నిర్ధారించలేక పోయారు. అందువల్ల ఆయనకు ఏలా మందులు వాడాలో నిర్ణయించుకోలేకపోయారు. మహారాజ రఘోజీరావు ఇక బాబా భౌతిక కాయంతో ఎక్కువ కాలం వుండరని నిశ్చయానికొచ్చారు. బాబా అంత అనారోగ్యంగా వున్నప్పటికీ ఆయన ముఖం మాత్రం ప్రశాంతంగానే వుండేది. ఒకరోజు మహారాజ రఘోజీరావు తాజుద్దీన్ బాబా దగ్గరకు వెళ్ళారు. బాబా ఎంతో ప్రేమతో ఆయన వైపు చూడగానే రఘోజీరావు బాబా పట్ల తనకున్న భక్తి గౌరవాలను కంఠములోనుంచి ఒలికిస్తూ ఆయనను ఇలా అభ్యర్థించారు. "బాబా ' మీ దర్శనం కోసం బయట ఎంతో మంది ప్రజలు వేచి యున్నారు. వారినందరినీ లోపలికి ప్రవేశపెట్టనా !" అని. బాబా చిరునవ్వుతో, "సరే, అలాగే కానీ" అన్నారు.

నిర్యాణం

1925వ సంవత్సరం ఆగస్టు నెల 17వ తేదీన ఎన్నో పక్షులు గుంపుగా వచ్చి మహారాజు భవనం మీద చేరాయి. వాటి సహజమయిన చేష్టలకు భిన్నంగా అవన్నీ అత్యంత నిశ్శబ్దంగా కదలక, మెదలక కూర్చున్నాయి. బాబా వాటిని చూచి తన చేతిని పైకెత్తి వాటి సంక్షేమం కోసం ప్రార్థించి వాటిని ఆశీర్వదించారు. తర్వాత ఆయన ప్రశాంతంగా పడుకున్నారు. కొద్దిసేపటికి ఆయన గొంతులో

నుండి చిన్న గురక వచ్చింది. వెంటనే ఆయన ఆత్మ అనంతంలో ఐక్యమై పోయింది. ఇన్నా-లిల్లాహి-వ-ఇన్నా-ఇలైహి-రాజీ-ఊన్ (మనమంతా దేవునికి చెందినవాళ్ళం ఆయన వద్దకే తిరిగి చేరుకుంటాం).

క్షణాల్లో ఈ వార్త నాగపూర్ పట్టణ ప్రాంతమంతా వ్యాపించింది. పట్టణ ప్రజలంతా ఈ వార్త విని అత్యంత దిగ్భ్రమ చెందారు. ఇన్నాళ్ళూ వాళ్ళందరూ తెలిసీ తెలియకా పొందుతున్న రక్షణ, పట్టణానికంతటికీ మూలంగా గల బాబా అలంటివారు సన్నగిల్లినట్లుగా భావిస్తూ బాధపడ్డారు. హిందూ, ముస్లింలు కూడా ఎంతో ముఖ్యమైన వస్తువును పోగొట్టుకున్నట్లుగా దుఃఖంతో కన్నీరు కార్చారు. దాదాపు అర్ధ శతాబ్దంపాటు వారందరికీ ప్రియ బాంధవుడాయన. దైవం యొక్క మూర్తీభవించిన కరుణే ఆయన స్వరూపమైనట్లు వారందరి దురదృష్టాన్ని తొలగిస్తూ, లౌకికంగా ఎదురైన వారి సమస్యలను పరిష్కరిస్తూ, వారికి అండగా నిలిచిన దైవ ప్రతినిధియైన తాజుద్దీన్ బాబా భౌతిక కాయాన్ని చివరిసారిగా దర్శించుకోవటం కోసం అసంఖ్యాకమైన ప్రజలు నలుదిక్కుల నుండి గుంపులు గుంపులుగా చేరారు.

**ఆఖరి సంస్కారం**

ఆఖరిసారిగా తాజుద్దీన్ బాబా భౌతిక కాయానికి చేయవలసిన లాంఛనాల విషయాల్లో విభేదాలు తలెత్తడం దురదృష్టకరమైన విషయమే. ఆయన భౌతిక చిహ్నంగా దర్గాను ఎక్కడ ఏర్పాటు చేయాలనే విషయమే ఆ విభేదాలకు కారణం. మహారాజా రఘోజీరావ్ తన భవనానికి దగ్గరలో నిర్మిస్తే బాగుంటుందని అనుకున్నారు. కాని అది జరుగని పని అని వారికీ తెలుసు! అందుకే ఆయన మౌనంగా ఊరుకున్నారు. ఆఖరుకు భక్తులందరూ కలసి చివరి నిర్ణయానికి వచ్చారు. ఒకప్పుడు తాజుద్దీన్ బాబా ఒక ఖాళీ ప్రదేశంలో కూర్చుని, "ఇక్కడి మట్టి చాలా మంచిది. ఇక్కడ నాకొక గుడి నిర్మిస్తే బాగుంటుంది" అన్నారు. భక్తులందరూ అప్పుడు ఆయన చూపించిన చోటులోనే ఆయన భౌతిక కాయాన్ని ఉంచి దర్గా నిర్మించాలని తీర్మానించారు. అత్యంత పవిత్రమైన ఆ దేహాన్ని ఊరేగింపుగా ఆ ప్రదేశానికి తీసుకువెళ్ళారు. ఆ ఊరేగింపులో దాదా లక్షమందికి పైగా ప్రజలు పాల్గొన్నారు. ఆయన శరీరాన్ని గోతిలో ఉంచుతుండగా ఎవరి

వాక్యాలను వల్లిస్తున్న మఠాధికారికి తాజుద్దీన్ బాబా గోచి ప్రత్యక్షమై నిల్చొని దర్శనమిచ్చారు. ఆయనను సమాధి చేసిన పవిత్రమైన రోజు 1925 ఆగస్టు నెల 18వ తేదీ. ఆ రోజు గురువారం కావడం విశేషం.

## దైవవిగ్రహం కన్నీరు

తాజుద్దీన్ బాబా తాము జన్మించినప్పుడు ఎలా అయితే ఏడవని రీతో ఆయన వెళ్ళిపోయినప్పుడు కూడా అలానే ఏమాత్రం బాధపడలేదు. ఆయన పుట్టినప్పుడు ఎలాగైతే వింతలు జరిగాయో అలానే ఆయన భౌతికంగా నిష్క్రమించిన సమయంలో కూడా వింత వింత విశేషాలు జరిగాయి. అవి కొద్ది రోజులు గడిచాక కాని లోకానికి వెల్లడి కాలేదు. 1925, ఆగస్టు 26వ తేదీన "ఈవెనింగ్ న్యూస్" అనే పత్రికలో నారాయణరావ్ మరట్ అనే ఆయన యిలా వ్రాశారు. "తాజుద్దీన్ బాబా నిర్యాణం చెందిన సమయంలో పాండురంగ మందిరంలోని విఠల్, రుక్మిణి విగ్రహాలు 12 గంటల పాటు ఏకధాటిగా కన్నీరు కార్చాయి. ఆశ్చర్యకరమైన ఈ దృశ్యాన్ని వేలాది భక్తులు చూశారు" ప్రముఖ దినపత్రికలైన "ది మెడ్రాస్ మెయిల్", "ఆంధ్ర పత్రిక" 1925, ఆగస్టు 22న యిలా వ్రాశాయి. "సాక్షాత్తూ శ్రీ రాముడే తిరిగి తాజుద్దీన్ బాబా రూపంలో అవతరించి లోకాన్ని పవిత్రపరిచారు. ఆయన వచ్చిన పని పూర్తి కాగానే ఆయన నిష్క్రమించారు. ఆయన మహాత్మ్యాన్ని అందరూ గుర్తించారు"

అంతటి కొద్ది కాలం మాత్రమే నడిచిన ఆయన జీవిత చరిత్ర నిజానికి ఆయన సమాధి చెందడంతో సమాప్తి కాలేదు. ఎందుచేత నంటే ఆయన ఒకసారి నిగూఢమైన శ్లేషను ధ్వనింపజేస్తూ రెండు వాగ్దానాలు చేశారు. అందులో ఒకటి సర్వ మానవాళికి వర్తించేది. రెండవది మహారాజ్ రఘూజీరావ్ గారికి వర్తిస్తుంది. కాలాంతరంలో శ్రీ రఘూజీరావుగారు తాజుద్దీన్ బాబా తనకు యిచ్చిన వాగ్దానాన్ని నెరవేర్చినట్లు స్పష్టం చేశారు.

తాజుద్దీన్ బాబా. తాము ఒక లక్షా 25 వేల మంది మహాత్ములను తయారు చేసే వరకూ తన కార్యక్రమాన్ని ఈ లోకంలో కొనసాగిస్తానని సర్వమానవాళికి వాగ్దానం చేశారు. మహాత్ములు అంటే ఆయన అభిప్రాయం కొందరికి వారివిగా

వారందరినీ తీర్చిదిద్దగలవాని. ఎందుకనేతనంటే హిందూ శాస్త్రాలన్నీ కూడా సద్గురువు అయినవారు తన శిష్యులందరినీ తనంతటి మహాత్ములుగా తయారు చేసేంతటి సమర్థులు అని చెప్తూ వున్నాయి. శ్రీ శిరిడీ సాయిబాబా కూడా తన భక్తులను ఎంతోమందిని తనంతటి వారిని చేశారు. శ్రీ ఉపాసనీ మహారాజ్‌ను తనంతటి సిద్ధపురుషునిగా చేసి, తన ఎదుటనే భక్తులందరిచేత ఆయనకు గురు పూజ చేయించి తాము, ఆయనా ఒకటేనని ప్రకటించడము, ఆ తరువాత ఉపాసనీబాబా తామిద్దరూ గూడ వేరు కారని భక్తులకు నిదర్శనాలివ్వడం గమనార్హం.

సద్గురువు తమ కృప వలన తమ శిష్యులను తనంతటి వారుగా చేయగల సమర్థులేనని అజ్మీర్‌లోని సూఫీ మహాత్ముడైన హజరత్ బాబా మొయినుద్దీన్ చిష్తీ తన అయిదుగురు శిష్యులైన హజరత్ కుతుబుద్దీన్. 2. హజరత్ బాబా ఫరీదుద్దీన్ 3. హజరత్ మఖ్‌దూమ్ అల్లాఉద్దీన్ సాబిర్ 4. హజరత్ బాబా నిజాముద్దీన్ ఔలియా. 5. హజరత్ ఖాజానశీరుద్దీన్ చిరాగ్‌లు వారి గురువంతటి వారుగా తయారు అవటం వల్ల మనం గుర్తించవచ్చు. పై ఆరుగురు మహాత్ములను వివరంగా "Six Great Sufi Saints of India" అనే గ్రంథంలో చదవవచ్చు.

తాజుద్దీన్ బాబా మహారాజ్ రఘోజీరావ్ గారితో ఒకసారి "నేను లక్షలాది సంవత్సరాలు నీ యింట్లోనే వుంటాను" అని అభయమిచ్చారు. బాబా చేసిన ఈ వాగ్దానం వల్ల ఆయన తన భక్తుల వెంటనే వుంటూ వారి జీవితాలలో ప్రవేశించి వారి ఆధ్యాత్మిక పురోభివృద్ధికి సహకరిస్తూ వుంటారని మనకు తెలుస్తున్నది.

'అడిగినవారికి అడిగినంత ఇస్తాను' అనే బాబా వాక్యాలు నిజంగా ఆయన నెరవేరుస్తున్నారనడానికి నమ్మదగిన సాక్ష్యాధారాలేమిటి? లేకపోతే తన భక్తులు తన సమాధి తర్వాత ఉత్సాహాన్ని కోల్పోకుండా భక్తి సాధనలు కొనసాగించడం కోసం ప్రోత్సహించడానికి చెప్పిన మాటలేనా అవి ? తను నమ్మిన సిద్ధాంతము, ఎంత రుచికరమైనదైనా అజ్ఞానము. స్వప్నములలో మునిగిపోయిన సందర్భాలలో తప్ప మిగతా విషయాలలో మానవులు తగిన ఆధారాలు లేనిదే ప్రాయశః తన

సమాధి అనంతరం కూడా తాజుద్దీన్ బాబా తాము యిచ్చిన వాగ్దానాన్ని న్యాయంగా నెరవేరుస్తున్నారనడానికి తగిన లీల వొకదానిని తెలుసుకుందాము.

## బాకీ తీర్చిన బాబా

తాజుద్దీన్ బాబా భక్తులలో సుభానుద్దీన్ ఒకడు. అతడు బాబా నిర్యాణం చెందేవరకు ఆయనకే సేవ చేస్తూ బాబాతోనే నివసించాడు. నిత్యమూ ఆయనకు అవసరమయ్యే పాలను టీక్‌పేటకు చెందిన ఒక స్త్రీ యిస్తూ వుండేది. ఒక సారి సుభానుద్దీన్ సక్రమంగా ఆమెకు పాల ఖరీదు చెల్లించలేకపోవటంతో ఆమె సుభానుద్దీన్‌కు పాలు పోయడం నిలిపి వేసింది. తాజుద్దీన్ బాబా ఆమెను తన భక్తుడైన సుభానుద్దీన్‌కు యథాప్రకారం పాలను పోయవలసిందిగా ఆజ్ఞాపించారు. ఆమె బాబాతో సుభానుద్దీన్ తనకు బాకీపడ్డాడని ఫిర్యాదు చేసింది. అప్పుడు తాజుద్దీన్ బాబా ఆమెతో "ప్రతి రోజూ అతనికి పాలను పొయ్యి, ఆ ఖరీదు నేను చెల్లిస్తాను" అని చెప్పి పంపారు. బాబా అలా వాగ్దానం చేయడంతో ఆ స్త్రీ సుభానుద్దీన్‌కు ఎప్పటిలాగే పాలను అందిస్తూ వచ్చింది. కొంతకాలం అలా నడిచాక ఆ స్త్రీకి పాలఖరీదు చెల్లించకుండానే తాజుద్దీన్ బాబా సమాధి చెందారు. ఆమె ఆ బాకీ వసూలు కావడం కలలోని మాట అనుకొని ఆశ వదులుకుంది. ఇంతలో బాబా నిర్యాణం చెందిన నాలుగవ రోజున ఆ స్త్రీ తన ఇంటి ముందు గల ఆవరణలో తన పాపకు స్నానం చేయిస్తూ వుంది. ఇంతలో అక్కడికి ఒక ఫకీరు వచ్చి ఆమెతో "తాజుద్దీన్ బాబా వాగ్దానం ప్రకారం నీవు ఇంతవరకు సుభానుద్దీన్‌కు పోసిన పాలఖరీదు ఇదిగో" అంటూ ఆమె చేతిలో 7 రూపాయల 9 పైసలను వుంచి వెళ్ళారు.

## అధ్యాయము - 4

## కాలానుగుణ్యమైన మహాత్ముడు

మానవచరిత్రను పరిశీలించినట్లయితే మనకందులో ఒకక్రమం గోచరిస్తుంది. మానవజాతికి తగిన హెచ్చరికలు. అవలు స్ఫురిస్తాయి. కొన్ని శతాబ్దాల నుండి క్రమంగా అభివృద్ధి చెందుతున్న దేశాంతర ప్రయాణ సౌకర్యాల వల్ల ఒక వంక వివిధ దేశస్థులు దగ్గరవుతున్నారు. మరో వంక అంతర్జాతీయ భాష ద్వారాను, గ్రంథ ముద్రణ, రేడియోలు మొదలైన సదుపాయాల వల్ల వివిధ దేశాల, మతాల వారి మనసులు దగ్గరపడుతున్నాయి. ఇందువల్ల మొదట కొంత ఘర్షణలు, భౌతికంగా దేశాల మధ్య, జాతుల మధ్య, మతాల మధ్య చెలరేగాయి. అయితే మానవుడు వీటితో విసుగు చెంది సమానం చేకూర్చుకోవలసిన అవసరం ఏర్పడుతుంది. పోటీ వారితో సామరస్యం చేకూర్చుకుంటాడు మానవుడు.

ఇటువంటి యిదే మార్పు పరిమిత స్థాయిలో మన దేశంలో కూడా జరుగుతూ వుండవచ్చు. మన దేశాన్ని వివిధ దేశాల వారు ఆక్రమించాక ఆ జాతి వారు మన దేశంలో స్థిరపడ్డారు. మొదట్లో యీ జాతిభేదాలు కలతలకు దారి తీసాయి. అయితే వెంటనే వారి మధ్య సమైక్యత కోసం కావలసినంత యత్నం కూడా ఆరంభమయింది. ఈ సంగతి మత విషయంలో స్పష్టంగా గోచరిస్తుంది. ఈ నూతనమయిన దృక్పథానికి కబీరు, నానక్ మొదలైన వారు ప్రతినిధులు. మత కలహాలు యీ శతాబ్దారంభంలో మన దేశంలో చాలా తీవ్రరూపం ధరించాయి. ఈ సత్యాల దృష్ట్యా చూచినట్లయితే మతాల మధ్య సమైక్యతకు దారిచూపు ధృవతారగా తాజుద్దీన్ బాబా గారిని తలచవచ్చు. ఉత్తర హిందుస్థాన్‌లో శ్రీ షిర్డీసాయిబాబా కూడా అదే కార్యాన్ని నిర్వహించారు. వీరిద్దరూ సమకాలికులు. అంతేకాక మానవునిలో మహత్తర శక్తులు దాగున్నాయని, సంస్కారంచేత అవి అభివృద్ధి చెందగలవని, వీరిద్దరి మహిమలు నిరూపించాయి. మతవిశ్వాసాలు సత్యాలని, అన్ని మతాలలోనూ సత్యం ఒక్కటేనని, నిజమైన తత్త్వవేత్త బాహ్య ఆడంబరాలకు అంధవిశ్వాసానికి, యితర మతాలపట్ల ద్వేషానికీ చాలిన దూరమని

ఏకత్వమూ నిరూపించారు. అస్సలు తాజుద్దీన్ బాబా ముస్లిం అయినప్పటికీ హిందువులను ఆయన పరాయివారిగా చూడలేదు, హిందువులనుగాని, వారి మతాన్ని గాని ఆయనెప్పుడూ విమర్శించలేదు. తన కృపను కురిపించడంలో ఆయన తన మతస్థుల పట్ల పక్షపాతం చూపలేదు.

## హరిజనుల సమస్య

హనుమంతరావు అనే ఆయన బాబా దగ్గరకు వచ్చి తనకు తానుగా బాబాకు సంపూర్ణంగా శరణాగతుడైనాడు. అతను పశువైద్యశాఖ ఉద్యోగి. కొంతమంది హరిజనులు ముస్లిములుగా మారి తాజుద్దీన్ బాబాకు శ్రద్ధగా సేవ చేసుకుంటూ లాభాన్ని పొందడం అతను గమనించాడు. అతనికి తను కూడా ముస్లిం మతాన్ని స్వీకరిస్తే బాబా కృప తనకు గూడ ఎక్కువగా లభిస్తుంది కదా అనే భావం కలిగింది. ఇటువంటి భావం హనుమంతరావు మనసులో మెదలగానే తాజుద్దీన్ బాబా ఏదైనా ఒక పుస్తకాన్ని తీసుకొని వచ్చి తనకివ్వవలసిందిగా అతనిని కోరారు. ఆ సమయంలో హనుమంత రావు దగ్గర భగవద్గీత గ్రంథమున్నది. వెంటనే అతడు ఆ గ్రంథాన్ని తాజుద్దీన్ బాబా చేతిలో వుంచి నమస్కరించాడు. బాబా ఆ గ్రంథాన్ని అందుకొని పుస్తకాన్ని చూస్తూ పేజీలు అటూ యిటూ త్రిప్పసాగారు. తర్వాత హనుమంతరావుతో "ఏమిటీ మతం ఇందులో కూడా వున్నాదే!" అన్నారు. అది విన్న హనుమంతరావుకు తనకు బాబా ఏ సందేశ మిచ్చారో అర్థమై ఆశ్చర్యపోయాడు. "భగవంతునికి సర్వ సమర్పణ చేసుకోవడం వల్ల సత్యం బోధపడుతుంది" అనే ధర్మాన్ని మహమ్మదీయ మతంలోనే కాక హిందూ మత గ్రంథమైన భగవద్గీతలో కూడా చెప్పబడి వుందనే విషయాన్ని బాబా హనుమంతరావుకు తెలియజేశారు. ఈ సత్యం గుర్తించిన హనుమంత రావు బాబాను సేవించి ఆయన కృపను పొందడానికి తను మతాన్ని మార్చుకోవలసిన అవసరం లేదని గుర్తించి బాబాకు భక్తితో నమస్కరించాడు. బాబా ఎన్నడూ మతాల మధ్య భేదాలను అంగీకరించలేదు. ఆయన తన భక్తు లందరికీ ఏ మతానికి చెందినవారిని ఆ మత ధర్మాల ప్రకారం నడుచుకోమని, ఎవరూ కూడా ముక్తి కొరకు గాని, తన కొరకు గాని యితర మతాల నుండి మహమ్మదీయ మతంలోకి చేరవలసిన అవసరం లేదనీ స్పష్టంగా చెప్పారు.

## ముస్లిం భక్తుని అభియోగం

నాగపూర్‌లో ఒక సారి మతకలహాలు చెలరేగాయి. ఆ సమయంలో ఒక ముస్లిం భక్తుడు బాబా దగ్గరకు వచ్చి హిందువులు ముస్లిములందరినీ చంపేస్తున్నారు. దయచేసి ముస్లిములను రక్షించమని అడిగాడు. తాజుద్దీన్ బాబా తీవ్రమయిన వ్యతిరేకతను ప్రదర్శిస్తూ, "వెళ్ళిక్కడినుండి. నిజమైన ముస్లిములను ఎవ్వరూ చంపలేరు" అని వచ్చిన భక్తుణ్ణి తరిమేశారు. బాబాచెప్పిన ఆ మాటల లోని భావం మనకర్థమయ్యేటంత స్పష్టంగా వుంది. మహమ్మద్ ప్రవక్త చెప్పినట్లుగా అంతటా పరివేష్టించియున్న దయామయుడైన అల్లాను దృఢంగా నమ్మి కష్టసుఖాలలో ఆయనపైనే ఆధారపడి ప్రవర్తించేవాడే ముస్లిం మతానికి వన్నె తెచ్చేవాడు. మిగతావారంతా పాపాత్ములు, వారంతా ముస్లిం అని పిలవడానికి అర్హత లేనివారు. ఇస్లాం మతం కూడా మిగతా మతాలవలెనే శాంతి, ప్రేమల పైననే ఆధారపడి వున్నది గాని హింస యందు కాదు. మతము ఒక అవలంబన మాత్రమే. గమ్యస్థానము దైవం మాత్రమే. అటువంటి నిశ్చయమైన నమ్మకము గల వ్యక్తి భూమి మీద దైవం చేతనే రక్షింపబడతాడు. దైవవశాత్తూ అతను చనిపోయినప్పటికీ నిజమైన భక్తుడు శాశ్వతమైన స్వర్గాన్నే పొందుతాడు. అంతేకాని నిజానికి ఏ మనిషీ అతనిని చంపలేడు. దైవం యందు నమ్మకం లేనివారే యితరుల చేత చంపబడతారు. బాబా ఆ భక్తుని తీవ్రంగా హెచ్చరించిన మాటలలోని నిజం యిదే!

తాజుద్దీన్ బాబా తన హిందూ భక్తులైన మహారాజా రఘోజీరావ్ భోంస్లే, శ్రీ కాశీనాథ పటేల్ గృహాలకు స్వయంగా వచ్చి కొంతకాలం వారి ఆతిథ్యాన్ని స్వీకరించడం అందరికీ తెలిసిన విషయమే. శ్రీ కాశీనాథ్ పటేల్ తాజుద్దీన్ బాబాకు చందనమద్ది పుష్పమాలాలంకృతుని చేసి హిందువుల ఆచారం ప్రకారం ఆయనను సేవించినప్పటికీ బాబా ఎప్పుడూ అడ్డు చెప్పలేదు. అయితే బాబా యొక్క ఇటువంటి అంగీకారం వల్ల బాబాకు హిందూ మత ధర్మాల పట్ల ప్రీతి వున్నదని, ముస్లిము మతారాధన పట్ల ప్రతికూలత వున్నదనీ అర్థం కాదు. ఎంతమందో ముస్లిం భక్తులు వారి ఆచార ప్రకారం బాబాను సేవిస్తుండగా సమానమైన ప్రేమతోనే వాటిని ఆయన అంగీకరించారు. సర్వసమానమైన

బాబా స్వభావాన్ని శిరిడీ సాయిబాబాతో పోల్చి చూడడం ఎంతో ఆసక్తిదాయకంగా వుంటుంది.ఆయన బాహ్యవేషం చూచి ఎంతో మంది జనులు శిరిడీ సాయిబాబా ముస్లిం మహాత్ముడనుకుంటారు. అబ్దుల్ అనే ముస్లిం భక్తుడు శిరిడీ సాయిబాబాతో ఒకసారి "బాబా ! హిందువు మీ ముఖానికి చందనమద్దుతుంటే నువ్వు ఎలా సహించి వూరుకుంటున్నావు? అది మన ఆచారం కాదు కదా?" అని అడిగాడు. అప్పుడు సాయి. "జైసా దేశ్ - వైసా వేశ్" (దేశ కాలాలననుసరించి వేషం హిందువులు నన్ను వారి దైవంగా కొలుస్తారు. నేను దాన్ని అంగీకరిస్తాను. అంతే నేను మాత్రం ఆ భగవంతుని సేవకుడిని మాత్రమే !" అని సమాధానం చెప్పాడు.

## వివక్షత లేని బాబా ప్రేమ :

మనం ఇంతకుముందు పేజీలలో చదివినట్లు పెడమార్గం పట్టిన కొందరు ముస్లింలు మహారాజా రఘోజీరావు మీద ఈర్ష్యతో మత కలహాలను లేవనెత్తినపుడు తాజుద్దీన్ బాబా ఆ వైషమ్యాలను చల్లార్చడానికి భౌతికంగా మహారాజు భవనం విడిచి వచ్చినప్పటికీ వచ్చేటప్పుడు, "నన్నిక్కడనుంచి ఎవరు తీసుకు వెళ్ళగలరు? లక్షలాది సంవత్సరాలు నేను నీ భవనంలోనే వాస చేస్తాను" అని రఘోజీరావుకి వాగ్దానం చేయలేదా ? తాజుద్దీన్ బాబా భౌతిక కాయాన్ని పరిత్యజించిన సమయంలో నాగ్‌పూర్ నగరంలోని పాండురంగని ఆలయంలో రుక్మిణీదేవి, విఠల్ విగ్రహాలు 12 గంటల పాటు ఏకధాటిగా కన్నీరు కార్చలేదా ? బాబా యొక్క ప్రేమ, రాతి విగ్రహాలను సైతం కరిగించగలదని అప్పుడు నిరూపణ కాలేదా ? దీనిని బట్టి తాజుద్దీన్ బాబా మత సంకరాన్ని ప్రోత్సహించారని అర్థం కాదు. ఆయన మత భేదాలకు అతీతమైన స్థితిలో వుండి ముస్లింలతో పాటు ఇతర మతస్థులను కూడా కష్టాలలో ఆదుకుంటూ వారి ఆధ్యాత్మిక పురోగతికి తోడ్పడ్డారు. ఎందరో బ్రహ్మవేత్త ముక్తపురుషుడుగా సేవింపబడిన గొప్ప పార్శీ మహాత్ముడైన మెహెర్ బాబా,తాజుద్దీన్ బాబా భక్తులలో ముఖ్యుడు. తాజుద్దీన్ బాబాను సేవించిన వారిలో హిందూ సాధువైన ఉపాసనీ బాబా కూడా వున్నారు. శ్రీ శిరిడీ సాయిబాబా, తాజుద్దీన్ బాబా ఇద్దరూ కలసి ఎందరినో గొప్ప సాధువులుగా తయారు చేశారు. పైచెప్పిన ఇద్దరు మహాత్ములు కూడ అంతటి సమర్థులుగా అవడం వారిద్దరి కృపకే నిదర్శనం.

ముస్లిం భక్తుల పట్ల తాజుద్దీన్ బాబా ఎలా ప్రవర్తించారో జాగ్రత్తగా పరిశీలిస్తే తప్ప ఈ చర్యను పిందుతనం రాదు. ముస్లిం భక్తుల పట్ల ఆయన ఎలా ప్రవర్తించారో ఇప్పుడు తెలుసుకుందాము.

## మహాత్ముడైన మన్సూర్

సర్ఫరాజ్ హుసేన్ అనే ఆయన చాలా తరచుగా బాబా దర్శనార్థం వస్తుండే వాడు. బాబాతో అతనికి చనువు ఎక్కువ. అతనికి బాబాలో వున్న చనువు వల్ల జంకు లేకుండా బాబాను తరచూ రకరకాలుగా ప్రశ్నిస్తూ వుండేవాడు. ఒక రోజున ఆయన బాబాను యిలా ప్రశ్నించారు "హుజూర్! సూఫీ ఫకీరైన మన్సూర్ అనల్‌హక్ (నేనే దేవుడిని) అని ప్రకటించడం వలన ఆయన శరీరం నిండా శీలలు కొట్టి చంపారు కదా ? ఆయన వాస్తవ స్థితి ఏమిటి ? ఆయన ఏమిటి ? ఆయన నిజంగా మహాత్ముడేనా ?"

అప్పుడు తాజుద్దీన్ బాబా "సోదరా నాయనా ! అతను గొప్ప మహాత్ముడు. అయితే అతనింకా కుర్రాడు. అందువల్లే తన గుప్పెటను తొందరగా విప్పేసాడు. తాజుద్దీన్ బాబా గుప్పెట మాత్రం విచారణ రోజు దాకా విప్పబడదు" అంటూ తన పిడికిలిని చూపారు. తాజుద్దీన్ బాబా చెప్పిన దానిలో యిమిడి వున్న వాస్తవం ఏమిటంటే మహాత్ములు నిజంగా భగవంతునితో వారికి గల ఐక్యతను భక్తులు విశ్వసించేలాగా ప్రకటించడం వారి స్వభావం. అయితే వారు వారి మాటలతో ఆ విషయాన్ని తెలియపరచినట్లయితే పెద్ద అపాయాన్ని ప్రోత్సహించినట్లవుతుంది. జ్ఞానస్థితిని పొందని దొంగ సన్యాసులు కూడా అలానే ప్రకటనలు చేసి లోకాన్ని మోసగించడానికి వీలు కల్పించినట్లవుతుంది. తాజుద్దీన్ బాబా తాను స్వయంగా దైవం యొక్క స్థితినే పొందియున్నప్పటికీ ఆయన ఎన్నడూ తానే దైవాన్ని అని ప్రకటించి వుండలేదు. ఆయన పరిభాషలో పిడికిలి తెరవడం అంటే తన రహస్యాన్ని బయట పెట్టడం అని ! ఇక్కడ అసలు మూసి మరుగు పరచవలసిన రహస్యం తాను దైవంతో ఏకత్వం పొందానన్న విషయం.

## మనమూ - దైవమూ !

నక్సర్లలో ఒకసారి బాబా అక్కడ గల చెరువుగట్టు మీద అటూ ఇటూ తిరుగుతున్నారు. అది మధ్యాహ్నం 3 గంటల సమయం. ఎప్పటిలాగానే బాబా చుట్టూరా అనేక మంది భక్తులు చేరి ఆయనను అనుసరిస్తున్నారు. వారిలో ఛాంద్ ఖాన్ ఒకరు. నడుస్తూ, నడుస్తూ వున్న తాజుద్దీన్ బాబా ఒక చోట ఆగి చాంద్ ఖాన్‌తో "ఇటువంటి గొప్ప మహాత్ముడు నడుస్తూ వుండగా ఆయన వెంట నువ్వు వుండి స్తోత్రాలేమీ చదవడం లేదేమి?" అని ప్రశ్నించారు. చాంద్‌ఖాన్ ఆయన సంతోషము కొరకు అంగీకరించి ఒక కీర్తన పాడాడు. కీర్తనంతా ప్రశాంతంగా విన్న తాజుద్దీన్ బాబా ఆ కీర్తనలోని చివరి వాక్యాన్ని వినగానే చాంద్‌ఖాన్‌తో "అన్న - ఏమిటీ నువ్వు రాళ్ళలో తల కొడుతున్నావ్?" అన్నారు. ఆయన మాటల అర్థం కాని చాంద్ ఖాన్ ఆశ్చర్యపోయాడు. బాబా చెప్పిన యీ మాట వలన తనకూ. ఆ దైవానికీ ఏ మాత్రమైనా తేడా కలదనే భావాన్ని ఆయన క్షణం కూడా సహించలేరనేది స్పష్టం. "నేను దైవానికి భిన్నంగా పరిమితంగా వున్నాను" అనే భావాన్ని "సర్వత్రా వ్యాపించిన చైతన్య స్వరూపుడైన దైవాన్నే నేను" అనే స్థితిని అందుకోవడం ద్వారా నాశనమొనరించాలని ఆయన భావం. పరమేశ్వరుడు ఆయనను కొలిచే వారితో సహా సమస్త జీవరాశిలోనూ వ్యాపించి వున్నాడని, భగవంతుడు తాజుద్దీన్ బాబా శరీరంలో మాత్రమే వున్నాడనే తప్పుడు అభిప్రాయం గల ఆ భక్తుల భావాలను ఆయన ఆ విధంగా సరిదిద్దారు. భగవంతునికీ, మనకూ అడ్డుగా వున్న తెరను మనం తొలగించుకోవాలని మహాత్ములందరూ వివరించారు. శ్రీ శిరిడీ సాయిబాబా కూడా "నీకూ - నాకూ భేదం కల్పిస్తున్న అడ్డు గోడను కూలదోయ్యి" అని చెప్పేవారు

## ప్రవక్తపట్ల గౌరవం

సుర్యానుబాయి అనే గొప్ప గాయని తాజుద్దీన్ బాబా దర్శనార్థం ఒకసారి నక్సర్లా వచ్చింది. ఆమె ఎప్పుడు వచ్చినా తాజుద్దీన్ బాబాలోని దైవ లక్షణాలను కీర్తిస్తూ పాటలు పాడేది. ఈసారి హజరత్ యిమామ్ హుసేన్ అనే మహాత్ముని "షేహన్‌షా" (రాజులలోకెల్లా రాజు) అని కీర్తిస్తూ పాడింది. ఆ పాట విని

తాజుద్దీన్ బాబా "నేనే ఆయన" అన్నారు. మరొకసారి ఆమె భగవత్ మహాత్ములని వారిని కీర్తిస్తూ "నడుముకు దుప్పటి కట్టుకున్న భగవంతుని చూచి అందరూ ఎల నవ్వుతారు" అని పాడింది. అది వింటూనే తాజుద్దీన్ బాబా నడుముకు దుప్పటి చుట్టుకొని, "అమ్మా, ఇదే ఈ భగవంతుని సింహాసనం" అంటూ బాహ్యస్మృతిని కోల్పోతూ భావసమాధిలోకి వెళ్ళారు. ఆమె అలా పాడుతూనే వున్నారు. ఆ సమయంలో అక్కడ వున్న వారంతా తాజుద్దీన్ బాబాలో దైవాన్ని చూశారు.

## గాన ప్రియుడు

చిష్తీ మహాత్ములందరిలాగానే తాజుద్దీన్ బాబాకు కూడా సంగీతం అంటే ఇష్టం. ఒకసారి బాబా సమక్షంలో కొందరు గాయకులు మధురంగా పాడసాగారు. ఆ గానాన్ని వింటూ తాజుద్దీన్ బాబా ఎంతటి తన్మయత్వాన్ని పొందారంటే వెంటనే ఆయన కాళ్ళకు గజ్జెలు కట్టుకొని పాడుతూ నృత్యం చేయటమారంభించారు. మరొకసారి ఆయన అలాంటి పారవశ్యంలోనే బాహ్య ప్రజ్ఞను కోల్పోయి, లాల్‌కోఠీలోని తన గదిలో నుంచి మూడు రోజులైనా బైటకు రాలేదు. దానితో ఆయన దర్శనార్థం వచ్చిన వేలాది ప్రజలు దర్శనం దొరకలేదని నిరాశ చెందసాగారు. అప్పుడు హజరత్ హకీమ్ నిజాముద్దీన్‌గారు లక్ష్మీబాయి అనే వేశ్యను పిలిపించి బాబాకు వినపడే విధంగా భక్తి కీర్తనను పాడవలసినదిగా కోరారు. అప్పుడామె యిలా గానం చేసింది

"అజ్ఞానపు చీకటిలో మునిగియున్నవారము<br>
నిజం చూచి పరవశించు కనులు లేని వారము<br>
నీ కృపాకటాక్షాలు మా మీద ప్రసరించి<br>
నిన్ను చూచు కనులు మాకు ప్రసాదించు ఓ ప్రభూ"

పై గీతంలోని ముగింపు వాక్యాలు వింటూనే తాజుద్దీన్ బాబా గదిలో నుంచి బాల్కనీలోకి వచ్చి నిల్చున్నారు. లక్ష్మీబాయి ఆ వాక్యాలనే మళ్ళీ మళ్ళీ పాడుతూ వుంటే బాబా అప్రయత్నంగా తన శరీరాన్ని ఊపుతూ వున్నారు. చివరకు ఎలాగో ఆ పారవశ్య స్థితిలోనే తన కోసం ఎదురుచూచే భక్తుల తృప్తి కోసం దర్శనమివ్వటానికి ఆయన క్రిందకు దిగి వచ్చారు. అప్పుడు బాబా అనుభవించిన పారవశ్యా

స్థి సూఫీ దర్వేషులు "హాల్" అని పిలుస్తారు. హిందూ శాస్త్రాలలో ఆ స్థితిని "సమాధి" అంటారు.

### బాబా బోధనలు

తాజుద్దీన్ బాబా తన వద్దకు వచ్చే కొందరు భక్తులకు ఎలా బోధ చేసేవారో గమనించడం మనకెంతో ఉపయోగకరంగా వుంటుంది.

ఒకసారి శిక్షితుడైన ఒక సాధువు తాజుద్దీన్ బాబాను సేవించి ఆయన వలన ఉపదేశం పొందాలనే తలంపుతో బాబా దగ్గరకు వచ్చాడు. అతనితో బాబా, "ఆ కుక్కను చంపి నా దగ్గరకు తీసుకురా మనమిద్దరం కలిసి దానిని భోజనం చేద్దాం" అన్నారు. ఆ సాధువు ప్రాపంచిక వ్యామోహంలో చిక్కుకొని వున్నాడని తాజుద్దీన్ బాబాకు తెలుసు. ఆ వ్యామోహాన్ని ఆయన చక్కగా బోధించారు. ప్రసిద్ధ మహాత్ములందరూ "ఈ ప్రపంచమంతా శవం వంటిది. కుక్కలు మాత్రమే దాని కోసం వెతుకుతాయి" అని ప్రవచించారు. పవిత్ర గ్రంథమైన ఖురాన్‌లో కూడా "లౌకిక సుఖాల కోసం అన్వేషించేవారు స్త్రీలు. నశ్వరమైన దానిని కోరేవాడు నపుంసకుడు. దైవం కోసం అన్వేషించేవాడే అసలైన పురుషుడు" అని చెప్పబడి వుంది. పైన చెప్పిన సూక్తిలో బాబా ఆ సాధువును ఐహిక వాంఛలను అణచి వేయమని (అన్నమయకోశము) అప్పుడే అతనికి సరియైన ప్రతిఫలం లభించగలదని బోధించారు. ఉపదేశం కోసం వచ్చిన మరొక భక్తుడు బాబాతో, "బాబా నా మనస్సు ద్వైతభావంలో చిక్కుకొనిపోయింది" అని వాపోయాడు. తాజుద్దీన్ బాబా అతనితో "ఆరుగురు దుర్మార్గులు నీ హృదయంలో నివసిస్తున్నందువలన నీ మనస్సు ద్వైతభావంలో చిక్కుకున్నది. వారిని వెళ్ళగొట్టడానికి ఏకాంతవాసం అవసరం" అని చెప్పి పంపారు. మరొక సందర్భంలో బాబా "ఏకాంతవాసమంటే అడవుల మధ్య నివసించడం కాదు. లోకంలో నివసిస్తూనే ప్రాపంచిక వాసనలలో చిక్కుకోని విధంగా మన మనస్సును ఏకాంతంగా వుంచుకోవడం" అంటూ సందేహనివృత్తి చేశారు. ఇటువంటి సందేహాన్నే వెలిబుచ్చిన ఒక భక్తునితో బాబా "బందీలుగా వున్న ఆ పావురాలను విడుదల చెయ్యి" అన్నారు. దాని అర్థం పావురాలు నిరంతరం ధ్వనిచేస్తూ

వున్న నవాబుకు ఆ ముత్యం అందించి ఆయనతో "అంతా నీవే తినేటట్లయితే వేరేవాళ్ళు ఏం పెట్టుకుంటారు" అన్నారు. తర్వాత ఆయన నవాబును ఒక బీడి యిమ్మని అడిగారు. నవాబు బీడి అందించగా ఆయన పొగ పీల్చసాగారు. ఇదే తగిన సమయమని నవాబు తన దావాకు సంబంధించిన పత్రాలను ఆశీస్సుల కోసం బాబాకు అందించాడు. బాబా వెలుగుతున్న బీడీతో ఆ కాగితాలను కాల్చి, "ఇదే నా ముద్రికా" అంటూ తిరిగి ఇచ్చేశారు. తన ఆస్తిని కూడ బాబా యిచ్చిన సలహాతోనే విభజించవలసి వుంటుందని ఆ నవాబు తెలుసుకున్నాడు "ఏది కావాలో నీవు కోరుకో" అని నవాబును ప్రోత్సహించారు.

## పాపిష్టి సొమ్ముకు తిరస్కారం :

నాగపూర్ కొత్వాలుగా అబ్దుల్ రహమాన్ అనే ఆయన వుండేవాడు. ఒక సారాయన తాజుద్దీన్ బాబాకు యిద్దామని కొన్ని వస్త్రాలు తీసుకొని సకర్దరా వచ్చాడు. అయితే బాబా వాటిని ముట్టుకొనైనా లేదు. అదే సమయంలో ఒక పేదవాడు వచ్చి బాబా కోసం తాను తెచ్చిన రొట్టెలను ఆయనకిచ్చాడు. అప్పుడు బాబా "మనం వీటిని తిందాం" అంటూ హృదయపూర్వకంగా వాటిని స్వీకరించారు. ఆ కొత్వాలు గూడ తాను తెచ్చిన వస్త్రాలను గూడ స్వీకరిస్తారని తలచాడు. కాని బాబా వాటిని స్వీకరించక ఆ కొత్వాలుతో, "వీటిని ఆరగించుకోవడం నా వల్ల కాదు" అన్నారు. తర్వాత కొత్వాలు తాను కష్టపడి ఆర్జించిన ధనంతో కాక అక్రమ ఆర్జన ద్వారా గడించిన డబ్బుతో ఆ వస్త్రాలను కొని తెచ్చినందున బాబా వాటిని స్వీకరించలేదని గుర్తించాడు.

బాబా అప్పుడప్పుడూ భక్తులకు చేసిన బోధలు, యిచ్చిన సందేశాలు మాత్రమే కాక అద్భుతమైన ఆయన జీవితమంతా మనకు ఒక పెద్ద సందేశమే! అయితే ఆయన జీవితమంతా సామాన్యులు అందుకోలేనంతటి ఉన్నతంగానూ గ్రహించలేనంతటి సూక్ష్మంగానూ వుండి, మనకు అవగాహన అవడం కష్టంగా వుంటుంది. మనకు అర్థమైనంతలో ఆయన జీవిత సన్నివేశాలను కొన్నింటిని తెలుసుకొని, గ్రహించగలిగినంత గ్రహిద్దాం.

## జాలి - కరుణ

హజరత్ తాజుద్దీన్ బాబా వృద్ధులు, పేదవారు, రోగులు, ఆర్తులు, దీనులు

మొరకైన వారి పట్ల ఎంతో జాలి, కరుణ చూపించేవారు. ఒక్క చూపులోనే ఆయన, కష్టజీవులు మౌనంగా అనుభవించే బాధను గుర్తించేవారు. ఓదార్పును, శాంతిని ప్రసాదించే ఆయన ప్రవర్తన అత్యంత సహజంగాను, సూటిగాను, మధురంగాను వుండేది. ఆయన అటువంటి చర్యలను ఎవరూ విపులీకరించవలసిన అవసరం వుండేది కాదు.

ఒక రోజున తాజుద్దీన్ బాబా నాగపూర్‌కు 14 మైళ్ళ దూరంలో వున్న ఒక గ్రామ వీధులలో నడుస్తూ వున్నారు. ఆయన వెంట ఎప్పటిలాగానే అనేక మంది భక్తులు అనుసరిస్తూ నడుస్తూ వున్నారు. అక్కడ పూరింట్లో శిథిలావస్థలో వున్న ఒక ఇంట్లో ఒక వృద్ధుడూ, ఒక స్త్రీ కలసి పిండిని విసురుతూ వుండగా ఆయన అటుగా నడుస్తూ వున్నారు. కరుణాసముద్రుడైన ఆ ఫకీరు వారి దగ్గరకు వెళ్ళి తిరుగలి దగ్గర నుంచి వారిని లేపి, చుట్టూరా వున్న భక్తులకు ఆశ్చర్యాన్ని కలిగిస్తూ ఆయన పిండిని విసరసాగారు. మొత్తం పిండినీ విసరడమయ్యాక దానిని కుప్పగా చేసి, ఒక్కమాటైనా పలకకుండా నిశ్శబ్దంగా అక్కడ నుంచి వెళ్ళారు. చూస్తూవున్న శ్రమజీవుల పట్ల ఆయన ప్రదర్శించిన కరుణను చూసి ఆయన భక్తుల హృదయాలు కరిగిపోయాయి. ఆ స్థితిలో వారేమి చేయడానికీ తోచక నిశ్చేష్టులై నిలబడిపోయారు.

మరొకసారి తన సర్వస్వాన్ని కోల్పోయిన వ్యక్తి చాలా దూరం నుంచి కాలి నడకన తాజుద్దీన్ బాబా దర్శనార్థం వచ్చాడు. అతడు వచ్చినప్పుడు బాబా చుట్టూ అనేక మంది ధనికులు గుమిగూడి వున్నారు. ధనికులైన ఆ భక్తుల గుంపు నుంచి భుజాలు రాసుకుంటూ వెళ్ళి బాబాను దర్శించడానికి అతను బిడియపడ్డాడు. అందుచేత అతడు దూరంగా వున్న చెట్టు క్రింద నిల్చొని బాబాను దర్శించడానికి అనువైన సమయం కోసం సహనంతో వేచి వున్నాడు. పగలంతా గడచి చీకట్లు వ్యాపించినప్పటికీ అతనికి బాబాను దర్శించే అవకాశం రాలేదు. పేదవాడైనా అతడు తినడానికి ఏమీ తెచ్చుకోలేదు. ఏమైనా కొనుక్కుందామంటే అతని జేబులు ఖాళీగా వున్నాయి. ఆ ప్రదేశం అతనికి క్రొత్తదవడం వలన అతని బాగోగులు విచారించే వ్యక్తులెవరూ అక్కడ లేరు. ఇంతలో బాబా భోజనం చేసే సమయమైంది. చుట్టూ వున్న భక్తులు రకరకాల పదార్థాలను తీసుకువచ్చి

ఆయన ముందుంచారు. అయితే బాబా, వారు తెచ్చిన పదార్థాలను వేటిని ముట్టక అక్కడ వున్న వారినుద్దేశిస్తూ యిలా అన్నారు "ముందు మన అతిథిని తృప్తిపరచి తరువాత మనము భోజనం చేద్దాము" భక్తులంతా ఆయన ఎవరిని ఉద్దేశించి 'అతిథి' అన్నారో అర్థం గాక బాబాకు అతిథియైన ఆ గొప్ప వ్యక్తి కోసం ఆ ప్రాంతమంతా వెతికారు. బాబాకు అతిథిగా వుండదగిన లక్షణాలు కల మహానుభావులు ఎవరూ వారి కంటబడకపోయేసరికి వారంతా తిరిగి బాబా దగ్గరకు వచ్చి మళ్ళీ మళ్ళీ ఆయనకు నైవేద్యాలు వడ్డించడం ప్రారంభించారు. ఈసారైనా బాబా భోజనం చేస్తారేమో అని వారి ఆశ. కాని తాజుద్దీన్ బాబా మళ్ళీ అదే వాక్యాన్ని నిశ్చయంగా చెప్పి బయట వున్న చెట్టు క్రింద ఆకలితో నీరసించి వున్న పేద వ్యక్తి తన అతిథి అని భక్తులకు తెలియజేశారు. వారంతా ఆ వ్యక్తి దగ్గరకు వెళ్ళి బాబా ఆజ్ఞను అతనికి తెలియజేసి, అతనికి షడ్రసోపేత భోజనాన్ని వడ్డించారు. అప్పుడు కృతజ్ఞతతో నిండిన అతను కళ్ళు ఆనందంతో వర్షిస్తుండగా వారితో ఇలా, 'దర్శనార్థం ఎంతో దూరం నుండి కాలినడకన ఇక్కడకు వచ్చాను. గడిచిన రెండు రోజుల నుండి నేను ఏమీ తినలేదు. ఇప్పుడు అంత దూరం నుండి శ్రమపడి వచ్చినందుకు తగిన ఫలితం లభించింది. గొప్ప మహాత్ములకుండే కరుణాపూరితమైన ఆదరణ నాకు బాబా నుండి లభించింది. కృతజ్ఞుడను" అన్నాడు.

భక్త కబీరు ఇలా చెప్పారు

"నీదు పాదసేవ చేయు
శక్తి నాకు కల్గునంత
నా యింటికి వచ్చుపోవు
సాధువులకు చాలినంత
భిక్షాన్నం సమకూర్చిన
అదే చాలు, నాకు దేవా"

అత్యంత హీనస్థితిలో వున్న ఒక బాలుని పట్ల బాబా ప్రదర్శించిన కరుణ యింకా అద్భుతమైనది. తాజుద్దీన్ బాబా సక్కర్దరాలో వుండగా కాళ్ళూ, చేతులు చచ్చుపడిపోయిన ఒక బాలుని అతని తల్లిదండ్రులు బాబా వద్దకు తీసుకువచ్చారు.

వారికి తెలిసిన వైద్యాలన్నీ చేయించి ఇంక పిల్లవానికి నయం కాదనే నిర్ణయానికి వచ్చాక, వారు ఆ బాలుని బాబా వద్దకు తెచ్చి సక్కర్దారాలోనే వదిలేసి వెళ్ళిపోయారు. ప్రతిరోజూ తాజుద్దీన్ బాబా దర్శనార్థం వేలకు వేల భక్తులు వచ్చిపోతున్నా అత్యంత దయనీయ స్థితిలో వుండి కనీసం మాట్లాడడానికి,ఏడవడానికి కూడ శక్తిలేని ఆ బాలుని ఎవరూ గుర్తించలేదు.

అతడు వారి కంట పడినా వారతని లక్ష్యపెట్టలేదు. వారంతా బాబాకు అర్పించ కోరిన రకరకాల కానుకలను తీసుకువెళుతూ వుంటే, ఆ బాలుడు చూస్తూ వుండేవాడు. ఒక రోజున తాజుద్దీన్ బాబా సరాసరి ఆ అబ్బాయి దగ్గరకు వెళ్ళి అతని కోసం భోజనం తీసుకురమ్మని ఆజ్ఞాపించారు. భోజనం రాగానే ఆయన ఆ బాలుని దగ్గర కూర్చొని నెమ్మదిగా అతని చేత కడుపు నిండా తినిపించారు. తరువాత నెమ్మదిగా అతని చేత నీరు త్రాగించారు. తరువాత తన భక్త బృందంలోని కొందరికి ఆ బాలుని పోషణ భారం అప్పగించారు. వారు గూడ బాబా ఆజ్ఞ వల్ల విధేయులై ఆ బాలుని సంక్షేమం సక్రమంగా జరిగేటట్లు చూశారు.

అటువంటి బాబా కరుణ కేవలం మానవాళి కొరకే పరిమితం కాలేదని ఈ క్రింది సంఘటనల వల్ల మనకు తెలుస్తుంది.

ఒకసారి తాజుద్దీన్ బాబా నాగపూర్ పట్టణానికి నాలుగు మైళ్ళ దూరంలో వున్న డిగోరి అనే గ్రామంలో తిరుగుతూ వున్నారు. ఆ రోజులలో నాగపూర్‌లోనూ, పరిసర గ్రామాలలోనూ ఎవరయినా అటు తిరిగే బాబాను అనుసరించి తిరుగుతున్న భక్తులకు మంచినీరు అందించడం ఆచారంగా వుండేది. ఆ ప్రకారంగానే ఆ రోజు కూడ డిగోరి గ్రామవాసులు బాబాతో పాటు వచ్చిన భక్తుల కోసం కుండలతో మంచినీరు తీసుకువచ్చారు. ఈ సారి బాబా వారితో వందగజాల దూరంలో నిలబడి వున్న ఒక గుర్రాన్ని చూపి దాని దాహం తీర్చమని చెప్పారు. వారలాగే బక్కెట్లతో నీరు తీసుకెళ్ళి ఆ గుర్రం ముందుంచారు. ఆ గుర్రం ఎంత దప్పికగొని వుందంటే అది వరుసగా నాలుగు బక్కెట్ల నీటిని త్రాగింది. అయితే భగవంతుని సృష్టియైన ఆ మూగగుర్రం అంతటి దాహంతో వుందనే విషయాన్ని బాబా గ్రహించగలరని ఎవరు తలచగలరు ?

గంగాబాయి :

భారతదేశపు సామాజిక వ్యవస్థలో అత్యంత దయనీయమైన స్థితిలో వున్నారు 'అస్పృశ్యులు' అని పిలువబడే కడజాతి వారు. అయితే దైవం ఎల్లప్పుడూ వారి పక్షనే వుంటూ వుంటాడు.

గంగాబాయి అనే హరిజన స్త్రీ ఒక రోజు తనకున్న దాంట్లోనే తాజుద్దీన్ బాబాకు నివేదనకై ఏదో వంటకాన్ని తయారుచేసి కాలి నడకన బాబా దర్శనార్థం బయలు దేరింది. ఆ సమయంలో తాజుద్దీన్ బాబా మహారాజ్ రఘూజీరావ్ గారి భవనంలో వుంటున్నారు. అయితే ఆమె బాబా నివసించే మందిరం దగ్గరకు రాగానే ధనికులైన భక్తులు సమర్పించిన వైభవాల మధ్యన వున్న తాజుద్దీన్ బాబా వద్దకు తన పేద వంటకాన్ని తీసుకొని వెళ్ళడానికి మనస్కరించక తన సంకల్పాన్ని విరమించుకుంది. అప్పటి సంఘ కట్టుబాట్ల ప్రకారం మహారాజ్ మందిరం లోపలికి అస్పృశ్య అయిన తాను వెళ్ళి, తన చేతితో తయారు చేసిన పదార్థాన్ని పట్టిస్తే యెదురయ్యే తీవ్ర పరిణామాలను తలచి భయపడింది. అందుచేత ఆమె తను తెచ్చిన పదార్థాన్ని ఒక గుడ్డలో మూట కట్టి ఆ మూటను దగ్గరనే వున్న ఒక చెట్టు కొమ్మకు వ్రేలాడదీసి బాబా నివసించే ప్రదేశానికి కొంచెం దూరంలో ఆయన దర్శనార్థం ఎదురుచూస్తూ కూర్చున్నది. కొద్ది సమయం గడిచాక భవనంలో వున్న బాబా, భక్తులతో తనకు భోజనం పట్టుకురమ్మని చెప్పారు. వారంతా ఒకరికంటే ఒకరు ఖరీదు అయిన వంటకాలను తీసుకు వచ్చారు. అయితే బాబా వాటిని తినడానికి నిరాకరించి, బయట చెట్టుకు వ్రేలాడు తున్న ఆహారమే తనకు కావాలని చెప్పారు. బాబా ఏమి కోరుతున్నారో అర్థం కాని ఆ భక్తులు కలవరపడ్డారు. వారు ఆ ప్రదేశమంతా వెతికి ఎక్కడా బాబా సూచించిన ఆహారం కనిపించక, వారు తెచ్చిన పదార్థాలే మళ్ళీ పట్టించారు. అయితే బాబా యింతకు ముందు తను కోరిన ఆహారాన్నే తీసుకురమ్మని పట్టు బట్టారు. బాబా చెప్పిన ఆహారం ఎక్కడ వున్నదో కనుక్కోలేక, వారంతా కలత చెందిన మనస్సులతో మౌనంగా బాబా ముందు తలలు వంచి నిలుచున్నారు. చివరకు ఆయనే లేచి గంగాబాయి తన మూటను వ్రేలాడదీసిన చెట్టు వద్దకు వెళ్ళి, దానిని విప్పి అందులోని ఆహారాన్ని స్వీకరించి, తన ప్రసాదంగా అందులో

కొంతభాగం మిగిల్చి, మళ్ళీ యథాప్రకారం ఆ మూటను చెట్టుకొమ్మకు కట్టి తన దారిన వెళ్ళిపోయారు. బాబా ఆ ప్రదేశాన్ని విడిచి వెళ్ళగానే గంగాబాయి ఆ మూటను విప్పి తెచ్చుకొని బాబా అందులో మిగిల్చి వెళ్ళిన అన్నమును ఆయన ప్రసాదంగా స్వీకరించింది. ఆమెకు పట్టిన అదృష్టాన్ని చూచి ఈర్ష్యపడిన కొందరు భక్తులు ఆమెను గూర్చిన వివరాలు అప్పటిలోనే అడిగారు. బాబాలోని దైవత్వాన్ని ఎలా గుర్తించిందో ఎందుకోసం బాబాకు నివేదన చేసుకొచ్చిందో ఆమెను వారు ప్రశ్నించినప్పుడు ఆమె యిలా చెప్పింది "ఆనాటి శ్రీ రాముడే, మళ్ళీ తాజుద్దీన్ బాబా రూపంలో అవతరించారు. మనమే ఆయనను గుర్తించలేకపోతున్నాము" అని. ఆమె చెప్పిన విషయం నిజమే. అందుకే జీసస్ క్రీస్తు చెప్పారు.

"తెలిసిన వారికి తెలియదు,

తెలియనివారికి తెలుస్తుంది" అని.

**అనుభవైక వేద్యం :**

నాగపూర్‌కు చెందిన గొప్ప సూఫీ మహాత్ముడైన తాజుద్దీన్ బాబా. తన భక్తులకు ప్రత్యక్ష అనుభవాలనివ్వడం ద్వారా ఆధ్యాత్మిక పాఠాలను నేర్పడం మనలను సంభ్రమంలో ముంచక మానదు.

ఒకరోజున గౌరవనీయులైన ఒక భక్తుడు బాబాతో "బాబా ! సమాధి స్థితిని (హాల్) అనుభవించేదెలాగ ? దానిని పొందే మార్గమేమిటి ?" అని అడిగారు. సమాధి అంటే ఏమిటో ఆ భక్తునికి ప్రత్యక్షంగా బోధించడానికి బాబా తన తలపైనున్న టోపీని తీసి నేల మీద తలక్రిందులుగా వుంచారు. ఆశ్చర్యం వెంటనే ఆ భక్తుడు సమాధి (హాల్) అనుభవాన్ని పొంది ఆ ఆనందంలో తలక్రిందులుగా నిల్చొని తన తలను, చేతులను ఆధారంగా చేసుకొని గెంతనారంభించాడు. బాబా మళ్ళీ ఆ టోపీని నేల మీద నుండి తీసి ఎప్పటి లాగే తన తలపై ధరించే వరకు ఆ వ్యక్తి పారవశ్యంలోనే వుండిపోయాడు. అప్పుడు బాబా ఆ వ్యక్తిని అడిగారు. "హాల్ అంటే ఏమిటో ఇప్పుడు నీకు బోధపడిందా ?" అని ఆ వ్యక్తి పూర్తి సంతృప్తితో బాబా కాళ్ళ మీద పడ్డాడు. పైన జరిగిన సన్నివేశాలలో రెండు

ముఖ్యమైన అంశాలున్నాయి. ఒకటి - ఆధ్యాత్మిక సాధనలో అత్యంత ఉన్నత స్థితిలో వున్న తాజుద్దీన్ బాబా లాంటి మహాత్ములు తమకున్న ఆధ్యాత్మిక శక్తితో ఎటువంటి సామాన్యుడికైనా 'హాల్' లాంటి స్థితులను సంకల్ప మాత్రం చేతనే అందివ్వగలరు. రెండవ అంశము ఏమిటంటే - అటువంటి అనుభవాలు మహాత్ములు తమ నుండి ఇతరులకు సంక్రమింప చేయడానికి వీలైనప్పటికి ఎంత శ్రమపడినా ఆధ్యాత్మిక సాధనలో ముందుకుపోయి 'హాల్' లాంటి అతీతస్థితుల అందుకోలేని వారికి తాజుద్దీన్ బాబా తన ఇచ్ఛతో అటువంటి అనుభవాన్ని ఇవ్వగలిగినంత సమర్థులు. తన శిష్యులైన శ్రీ వివేకానందస్వామికి, శ్రీ రామకృష్ణ పరమహంస బ్రహ్మానుభవాన్ని ప్రసాదించడం పైన చెప్పిన సన్నివేశానికి సరిపోతుంది. మహాత్ములైన శ్రీ శిరిడీసాయిబాబా గూడ తన గురువు తనను తలక్రిందులుగా ఒక బావిలో వ్రేలాడదీశారని, అప్పుడు పారవశ్యంలో ఒళ్ళు మరచిపోయామని చెప్పారు. శ్రీ శిరిడీసాయి బాబా గూడ స్వయంగా తానే ఒక మీడి వ్యక్తునికి తన చేతి కదలికతోనే అటువంటి అతీత అనుభవాన్నిచ్చి, మళ్ళీ తన చేతి కదలికతోనే దానిని తొలగించారు. మరొక భక్తునికి కూడ ఆయన అలాగే తను కప్పుకున్న వస్త్రాన్ని అతని మీద కప్పడం ద్వారా అతనిలోని పాత వ్యక్తిత్వాన్ని తీసి కొత్త వ్యక్తిత్వాన్ని ప్రవేశపెట్టారు.

మరొకసారి తాజుద్దీన్ బాబా భక్తులు వెంట రాగా వాకీ ప్రాంతంలోని అడవులలో తిరుగుతున్నారు. చాలా దూరం నుంచి వారికి ఒక కవ్వాలి (భక్తి గీతం) వినపడింది. అది వింటూనే బాబా, "నేను కూడా నన్ను నేను మరచిపోయుండల్లో" అన్నారు. ఆ కవ్వాలిలోని భావాన్ని బాబా ఈ విధంగా వివరించారు "సర్వత్రా వ్యాపించిన దైవాన్ని నిరంతరం గుర్తు పెట్టుకోవడం ద్వారా ఎవరైతే నానొక వ్యక్తిని అనే భావాన్ని విడిచిపెట్టలేరో అటువంటి వారు భగవద్దర్శనం కోసం ఎన్ని ప్రయత్నాలు చేసినా ఫలించవు" అని.

మహాత్ములకు సహజంగా బాబా ఆత్మానుభవాన్ని పొందిన సంఘటనలు ఎంతో అద్భుతమైనవి. ఒకసారి ఒక గాయకబృందం ఆయన ఎదుట పాడుతూ వుండగా బాబా "హాల్" అనే స్థితిని పొందారు. ఆ స్థితిలో ఆయన వరుసగా రెండురోజులు ఉన్నారు.

ప్రతి మతంలోనూ గల సంప్రదాయ దృక్పథం తాజుద్దీన్ బాబా, సాయిబాబా జీసస్ క్రీస్తు మొదలైన సహజ సన్యాసులను ధర్మ బాహ్యులుగా ఎంచుతుంది. కొంచెం ఆలోచించి చూచినట్లయితే యిటువంటి మహాత్ముల వల్ల మత ధర్మాలు పరిపూర్ణమవుతాయి గాని కలుషితం కావు. క్రీస్తు వలెనే తాజుద్దీన్ బాబా కూడ శాస్త్రజ్ఞానం తమకే కలదని గర్వం గల పండితుల వాదాన్ని నయం చేసేవారు.

ఒకసారి సక్కర్దరాలో కొందరు పండితులు ఖురాన్ లోని కొన్ని వాక్యాల అర్థం గురించి చర్చించుకుంటున్నారు. వారంతా కుహనా పండితులు, లేనన్ని గర్వం గలవారే. అప్పుడు తాజుద్దీన్ బాబా తన మందిరంలో నుండి బయటకు వచ్చి పవిత్ర గ్రంథమైన ఖురాన్‌లో నుండి ఈ వాక్యాలు వినిపించారు.

"ఇస్లాంకు దగ్గర వచ్చినందుకు ఎవరైనా నీకు కృతజ్ఞతలు చెప్పినట్లయితే మీ అందరికీ ఇస్లాం యందు నమ్మకం కుదిర్చిన భగవంతునికి కృతజ్ఞుడై వుండమని చెప్పు" తాజుద్దీన్ బాబాకు ఖురాన్ అంతా ప్రాణవాయువు వంటిది. ఈ సమయంలో బాబా ఉద్దేశ్యము అక్కడ చేరిన పండితులను ఖురాన్‌లోని అక్షరాలను పట్టుకొని వ్రేలాడకుండా ఖురాన్ హృదయాన్ని అర్థం చేసుకోమని.

తాజుద్దీన్ బాబా వంటి మహాత్ముల చర్యలు దైవం యందు పూర్తి విశ్వాసము, గౌరవము కల్గించేవిగా లేవని కొందరు వాదిస్తారు. అయితే నిజానికి అటువంటి మహాత్ములే భగవంతుని అద్భుత శక్తికి ప్రత్యక్ష సాక్షులు. చలనం లేని నమ్మకంతో నిశ్చింతగా వారి భారమంతా భగవంతునికే వదిలివేసిన వారి జీవితాలే అందుకు నిదర్శనాలు. దైవానికి, మానవునికీ మధ్యవర్తులవంటివారు మహాత్ములు. జీవులకు సరియైన తీరానికి చేరడానికి ఉపయోగపడే దీపస్తంభాల వంటివారు. ఈ క్రింది సంఘటన తాజుద్దీన్ బాబా దైవము అనే అభిప్రాయాన్ని తెలియపరిచే విధంగా వుంది.

ఒకనాటి సాయంకాలం సక్కర్దరాలో బాబా చెరువు గట్టు మీద కూర్చుని వున్నారు. ఆయన చుట్టూ సన్నిహితులతో సహా భక్తులంతా కూర్చుని వున్నారు. ఆ సమయంలో దగ్గరలో వున్న మసీదు నుండి సాయంత్రపు ప్రార్థన (నమాజ్)కు వేళ అయినట్లు తెలుపుతూ కేక వినబడింది. అది వింటూనే బాబా, "అదిగో

లీలలను చూపి తాను ఉత్తమ మహనీయుడనని నిరూపించుకున్నారు. బాబా ప్రదర్శించిన అటువంటి మహిమలలో తెల్ల మనస్సుకు హత్తుకోగల మహిమ ఆయన ఒకే సమయంలో అనేక చోట్ల వేరు వేరు రూపాలతో ప్రకటమవడం. ఆయన సక్కర్దరాలోగాని వాకీలోగాని భక్తబృందంవద్ద కూర్చొని వుండగానే దూరాన వున్న ఒక భక్తుని ఇంటికి గాని, ఆఫీసుకు గాని వెళ్ళేవారు. కష్టాన్ని ఆదుకోవడం గాని, లేక వారి ఆఫీసు పనులను తాము నిర్వహించడం కాని చేసేవారు. ఒకసారి తాజుద్దీన్ బాబా రెండవ రూపంతో 'లాయర్' వేషంలో కోర్టుకెళ్ళి వాదించారు. మరొకసారి ఆయన కోర్టులో జడ్జిగా అవతరించారు. అటువంటి మహిమలు శ్రీ షిరిడీ సాయిబాబా వంటి అనేక మంది సద్గురువులు ప్రదర్శించి వున్నారు. మహాత్ములు ప్రదర్శించిన అపూర్వమైన ఈ లీలలను శ్రీ పరమహంస యోగానందగారు సేకరించి తమ ఆటోబయోగ్రఫీ ఆఫ్ ఎ యోగి అనే గ్రంథంగా ప్రచురించారు. అటువంటి లీలలనే ఇస్లామిక్, అరబ్బీ దేశవాసులైన మహాత్ములు కూడా ప్రదర్శించినట్లు ఆధారాలున్నాయి.

కన్ను మూసి కన్ను తెరిచేంతటి సమయంలోనే వేలకొలది మైళ్ళు ప్రయాణించి తన భక్తులను కూడా తమతో పాటు తీసికెళ్ళినటువంటి అద్భుత సన్నివేశాలు కూడ మహాత్ముల జీవితాలలో వున్నాయి. తమను కోరినట్లు కోరినవారి ఎక్క కాలితోనూ వారలలో దుఃఖములో మునిగివున్న వారికి దుఃఖ నివారణ. ఆధ్యాత్మిక పురోగతి కల్పించాలనే పరమేశ్వరుని దయాపూరిత హృదయానికి ఈ మహిమలు చిహ్నాలు మాత్రమేనని హిందూమత గ్రంథాలతో పాటు అన్ని మత గ్రంథాలూ ప్రకటించి వున్నాయి.

ఉత్తరప్రదేశ్‌లో పడౌనా అనే పట్టణం ఉంది. అక్కడ అహమ్మద్ అలీ షా అనే ఒక కాజీ నివసించేవాడు. వివాదగ్రస్తమైన ఆస్తులను వేలం వేసే అధికారిగా ఆయన ఉద్యోగం చేసేవాడు. అతని జీతము చాలా తక్కువవడం వలన అతను నిర్భయంగా లంచాలు పుచ్చుకునేవాడు. అతను కొంత కాలానికి ఆ వూరి నుంచి మరొక చోటికి బదిలీ చేయబడ్డాడు. అక్కడ అతను వ్రాసిన ప్రభుత్వ ఖాతాలలో 14 రూపాయల తేడాను పై అధికార్లు పట్టుకుని ప్రభుత్వపు డబ్బు సంగ్రహించినందుకుగాను అతని మీద చర్య తీసుకున్నారు. శిక్ష నుండి తప్పించు

కొడానికి ఆలీషా పై అధికారుల ప్రాపకానికై ఎంతో ధనం వెచ్చించాడు. అయినా ఫలితం శూన్యం. విసిగిపోయిన ఆలీషా దైవకృప తప్ప తనకు వేరే మార్గం లేదని గ్రహించి సాధువుల, ఫకీర్ల ఆశీర్వాదాల కోసం దేశమంతా తిరగడం మొదలు పెట్టాడు. ఎందరో సాధు సత్పురుషులుగా కొలువబడే వారిని దర్శించి ఆశీస్సులు పొందాడు. అయినా ఫలితమేమీ కనిపించలేదు. ఆలీషాకు తాజుద్దీన్ బాబాను దర్శించి ఆయన రక్షణ పొందమని ఎవరో సలహా ఇచ్చారు. ఉదయవేళ ఆలీషా అవసరమైన సామాను సర్దుకొని నాగపూర్ వచ్చి తాజుద్దీన్ బాబాను దర్శించాడు. ఆలీషాను చూస్తూనే తాజుద్దీన్ బాబా "ఉండిపో" అన్నారు. బాబా ఆజ్ఞానుసారం అతడు నాగపూర్‌లోనే వున్నాడు. మరుసటి రోజున అతడు మళ్ళీ బాబా దగ్గరకు వెళ్ళగానే బాబా మళ్ళీ, "ఉండిపో" అన్నారు. ఇంకా కొన్ని రోజులు గడిచాక తాజుద్దీన్ బాబా ఇంటికి వెళ్ళడానికి అతనికి అనుజ్ఞ ఇస్తూ, "నేను నీతోనే వున్నాను" అని అభయమిచ్చారు.

చాలా రోజులుగా అష్ఫాక్ ఆలీషా ఇల్లు విడిచి తిరుగుతున్నందువలన ఎటువంటి వార్తలను వినవలసి వస్తుందోనని సంకోచంతో ఇల్లు చేరాడు. అతను తలుపు తట్టగానే ఇంట్లో వాళ్ళు తలుపులు తెరిచారు. అష్ఫాక్ ఆలీ షాను చూచి వచ్చినట్లు ఎవ్వరూ ఆశ్చర్యాన్ని కనబరచలేదు. ఆలీషా తన భార్యతో టాంగావాలని డబ్బు చెల్లించమని అడిగేసరికి ఆమె, "రోజూ ఉదయాన వెళ్తారు, రేపు తెస్తానంటూ వేగొడుతున్న నా చెవిరింగులు యివ్వాళైనా తెస్తావా లేదా ?" అని పేచీ పెట్టుకు కూర్చుంది. ఆమె మాటలు ఆలీషాని దిగ్భ్రాంతుడిని చేసింది. సంవత్సరం క్రితం ఇల్లు విడిచి సాధువులను చూస్తూ దేశమంతా తిరిగి తాను ఇప్పుడే తిరిగి వస్తున్నానని అతడు ఎంతగా చెప్పినా ఎవరూ నమ్మడం లేదు. ఎందుకంటే రోజూ ఆ కాజీ ఉదయమే బైటికి వెళ్ళి రాత్రి అయ్యేసరికి తిరిగి రావడం అందరూ చూస్తూనే వున్నారు. అంతా కాజీ ఏడాది నుంచి తాను పూర్తిగా లేనని చెప్పే మాటలు ఎలా నమ్ముతారు ? కాజీ వారి మాటలన్నీ అర్థం పర్థం లేని తలతిక్క వాగుడుగా తీసి పారేశాడు. అయితే కుటుంబ సభ్యులు అతనేమిటో ప్రవర్తన, వారు పెట్టిన పేచీలన్నీ అతనికి అనుకూలంగానే తీర్పు చెప్పారట. అతను జీతాన్ని కూడా అందుకున్నట్లుగా కూడా చెప్పేసరికి కాజీగారికి

జారి తిరిగి వెంటనే తాను పనిచేసిన ఆఫీసుకు వెళ్ళాడు. చాలా రోజుల తరువాత ఆఫీసుకొచ్చిన అలీషాను చూసిన ఆఫీసు ఉద్యోగులెవరూ అతనిని చూసి ఆశ్చర్య పోలేదు. అతనిపట్ల ఆసక్తి కనబరచలేదు. అతని హాజరు పుస్తకాన్ని తీసి చూసేసరికి అందులో ప్రతి రోజూ అతని సంతకం పెట్టబడి వుంది. ఆ రోజునే అతని పై అధికారి కాలేని పిలిపించి యింత కాలం ఆ కేసులు సమర్థంగా కొనసాగించినందు కు సంతోషం వెలిబుచ్చారు. అయితే అహ్మద్ అలీషా ఇంతకాలం ఆఫీసుకు రాకపోవడాన్ని గూర్చిన ఒక్క మాటైనా అనలేదు. అప్పటికి గాని అహ్మద్ అలీకి - "నేను నీలోనే వున్నాను" అని బాబా తనకిచ్చిన వాగ్దానాన్ని నెరవేరుస్తున్నారని. తాజుద్దీన్ బాబా తన రూపం ధరించి కోర్టులకు, ఆఫీసుకూ సంవత్సర కాలం తిరిగారనే అద్భుతమైన మహిమను గుర్తించాడు అలీషా

బాబా ప్రదర్శించిన వర్ణించనలవి కాని ఈ కరుణపట్ల కృతజ్ఞుడైన అహ్మద్ అలీషా స్వయంగా తానే వెళ్ళి బాబాకు తన కృతజ్ఞతలు చెప్పుకోవాలని నాగపూర్ కు వెంటనే ప్రయాణమయ్యాడు. మార్గమధ్యంలో అతడు ఢిల్లీస్టేషన్‌లో రైలు మారవలసి వుంది. అక్కడ ఒక కుక్కతో పాటు ఒక వ్యక్తి కాజీని అనుసరిస్తూ అతని ప్రక్కనే నడవనారంభించాడు. ఒక్క టిక్కెట్ కలెక్టర్ ఆ నూతన వ్యక్తిని టిక్కెట్టు చూపమని అడుగగా ఆ వ్యక్తి తాను, ఆ కుక్క కాజీతో పాటు వచ్చామని, తమ టిక్కెట్లు ఆ కాజీ దగ్గర వుందని చెప్పి స్టేషన్ బయటికి వెళ్ళాడు. టిక్కెట్ కలెక్టర్ కాజీని టిక్కెట్లు గూడ చూపించమని అడిగాడు. ఆ కాజీ తనకూ వారికీ ఎట్టి సంబంధమూ లేదని, తన వెంట ఎవరూ రాలేదని చెప్పి, స్టేషన్ బయటకు వచ్చి చూడగా అతనికి ఎక్కడా ఆ కుక్కగాని, ఆ వ్యక్తిగాని కనిపించలేదు. మీద పడిపోయింది కదా ! అని తేలికగా నూపిరి పీల్చుకున్నాడు కాజీ. తరువాత అతడు నాగపూర్ వెళ్ళి తాజుద్దీన్ బాబాను చూస్తూనే గౌరవపూర్వకంగా ఆయన పాదాల మీద పడ్డాడు. అతనిని చూసి బాబా పెద్దగా నవ్వుతూ, "నేను నీలోనే వుంటానని నీకు చెప్పలేదా ? ఢిల్లీ రైల్వేస్టేషన్‌లో మళ్ళీ నా మాటలు మరచి మన సంబంధాన్ని తెంచేశావు" అన్నారు. ఢిల్లీ రైల్వేస్టేషన్‌లో తనకు తారసిల్లిన ఆ నూతన వ్యక్తి, కుక్క సాక్షాత్తూ తాజుద్దీన్ బాబాయేనని గుర్తించిన అలీషా దిగ్భ్రాంతుడయ్యాడు. "అరెరే ! నేను ఎంత మూర్ఖంగా అప్పుడు బాబాను

తిరస్కరించాను" అనుకున్నాడు. ఆ భావన అతని మనస్సులోకి రాగానే గుండెలు ద్రవించి అతని కళ్ళు నీళ్ళతో నిండాయి. పశ్చాత్తాపంతో కన్నీరు కారుస్తూ ముకుళించిన హస్తాలతో కాళీ తాజుద్దీన్ బాబాను క్షమాపణ వేడాడు. అతనిని క్షమించడానికి తాజుద్దీన్ బాబా ఎప్పుడూ సిద్ధంగానే వున్నారు. ఆయన అతనిని పలకరించి చిరునవ్వుతో ఆశీర్వదించి పంపారు.

ఒకసారి మద్రాసుకు చెందిన బ్రాహ్మణుడొకడు నాలుగురోజులు పాటు ఆఫీసుకు సెలవు పెట్టి తాజుద్దీన్ బాబాను చూడడానికి నకర్దరా వచ్చాడు. మహాత్ముడైన తాజుద్దీన్ బాబా సన్నిధిలో ఆయన సేవ చేసుకుంటూ ఆ నాలుగు రోజులూ ఆనందంగా గడిపి. నాలుగవ నాడు ప్రయాణమై తిరిగి తన వూరు వెళ్ళడానికి బాబా అనుమతి కోరాడు. అయితే బాబా అతనికి నకర్దరా విడిచి వెళ్ళడానికి అనుమతించలేదు. మరొక వారం రోజులు గడిచాయి. తాను పనిచేసే ఆఫీసులో ఏం జరుగుతున్నదో అని ఆ బ్రాహ్మణుడు ఆందోళనపడి మద్రాసుకు తిరిగి వెళ్ళడానికి మరొకసారి బాబా అనుమతి కోరాడు. బాబా మౌనంగా వూరుకున్నారుగాని అతనికి వెళ్ళడానికి అనుమతించలేదు. ఈసారి కూడ బాబా తమంతట తామే వెళ్ళమని చెప్పేవరకు అందరికీ ప్రభువైన ఆయననే సేవించు కుంటూ వుండాలనుకుని ఆగిపోయాడు. నెల రోజులు గడిచాక బాబా అతనిని పంపివేశారు. నకర్దరా నుంచి మద్రాసు వెళుతూ త్రోవలో, "సెలవు పెట్టకుండా వచ్చాను కదా ఆఫీసులో పై ఆఫీసరు ముందు తల వంచుకోవలసి వస్తుందే. అందరి ముందూ చీవాట్లు తిని తలెత్తుకు తిరగడమెలాగా "" అనే ఆందోళనతో ఇల్లు చేరాడు. ఇల్లు చేరిన అతనిని చూసి భార్యగాని, పిల్లలు గాని అతనిని ఇంతకాలం ఎక్కడున్నావనిగాని, ఎందుకు రాలేదనిగాని ఒక్కమాటైనా అడగలేదు. ఆఫీసులో గూడ నెల రోజులు ఎగ్గొట్టావేమిటి ? అని ఒక్కరూ ప్రశ్నించలేదు. అదంతా చూసి ఆశ్చర్యపోయినాడా బ్రాహ్మణుడు. ఎప్పటిలాగే ఆ రోజు ఆ సాయంత్రం గూడ జవాను వచ్చి చిన్న పెట్టెను, ఫైల్సును ఆఫీసరుగారు మీకు ఇమ్మంటున్నారని చెప్పి వెళ్ళాడు. ఇప్పుడా బ్రాహ్మణుడు ఇదంతా తాజుద్దీన్ బాబా లీల అని. తన రూపం ధరించి ఇంటి వద్ద, ఆఫీసులో గూడ తనలాగే ప్రవర్తించారని. అందువల్లనే తాను వూళ్ళో లేని విషయం ఎవరికీ తెలియలేదని

గుర్తించాడు. అప్పటినుండి తనతోటి పురోహితులకు, లోకానికి జరిగిన సంగతంతా చెప్పేసరికి అందరూ బాబా మహాత్మ్యాన్ని కొనియాడారు.

జన్‌షా అనే వృద్ధుడైన ముస్లిం జ్ఞానాన్వేషణలో ఆఫ్ఘనిస్తాన్‌లోని అడవులలో తిరుగుతున్నాడు. అలా తిరుగుతూ తిరుగుతూ ఒకసారి అతడు పవిత్రక్షేత్రమైన మక్కా యాత్రకు వెళ్ళాడు. అక్కడ ఆకుపచ్చని రంగు దుస్తులు ధరించి వున్న ఒక సాధువుని చూసి అతని ముఖంలోని వర్చస్సును చూసి ముగ్ధుడై ఆయనకు నమస్కరించాడు. అప్పుడు ఆ సాధువు విదేశీయ యాసతో "ఇక్కడ కాదు కమలా ఫలాలకు పేరు మోసిన నాగపూర్ పట్టణం దాపునేగల 'వాకీ' కి రా అక్కడ నీకు అన్ని సంగతులూ తెలుస్తాయి" అన్నారు. వాకీ ఎక్కడుందో, ఏమిటో వివరాలు అడుగుదామని జన్‌షా అనుకుంటూండగానే ఆ సాధువు మాయమై పోయారు.

ఎలాగో జన్‌షా నాగపూర్ చేరుకుని అక్కడ 'వాకీ' కి వెళ్ళే మార్గమెలాగో విచారిస్తున్నాడు. అతని ఉచ్చారణలోఒక విధమైన యాస వుండడం వల్ల నాగపూర్ స్థానిక ప్రజలకు అతని మాటలర్థంగాక అటువంటి ప్రదేశం అక్కడెక్కడా లేదని చెప్తున్నారు. ఏం చేయాలో తోచనిస్థితిలో జన్‌షా ఒకచోట నిలబడి వుండగా తాజుద్దీన్ బాబా భక్తుడైన అబ్దుల్ ఖాన్ అనునతను తారసపడి అతనికి 'వాకీ' వెళ్ళే మార్గం చెప్పాడు. తాజుద్దీన్ బాబాను చూడడంతోనే మక్కాలో తనకు కనిపించిన సాధువు ఇతడేనని జన్‌షా గుర్తించాడు. అతడు తాజుద్దీన్ బాబా భక్తుడై తన జీవిత శేషాన్నంతా ఆయన సన్నిధిలోనే గడిపాడు. వాకీ నుంచి బాబా సక్కర్దరా వెళ్ళినప్పుడు జన్‌షా కూడా బాబాతో పాటే సక్కర్దరా వెళ్ళి అక్కడే వున్నాడు. సక్కర్దరాలో ఒకరోజు బాబా ఉద్వేగపూరిత భావాలతో వుండి ఎవరినో తిడుతుంటే జన్‌షా బాబాను ఇలా అడిగాడు "బాబా! ఎందుకు వారిని అలా తిడుతున్నారు?" అని. బాబా చాలా ప్రేమగా అతనికిలా సమాధానమిచ్చారు "లేదే నేను అతనిని తిట్టడం లేదు. ఆశీర్వదిస్తున్నాను" అని. ఆఫ్ఘనిస్తాన్ నుంచి ఆ భక్తుని తన చెంతకు చేర్చుకున్న బాబా చర్య అద్భుతమైనది.

## అధ్యాయము - 6

# గురుమహరాజ్ తాజుద్దీన్

దైవత్వ ప్రతిభకంతటికీ ప్రత్యక్షులు పూర్ణజ్ఞానాన్ని పొందిన మహాత్ములే. వారి జీవితాలు పవిత్ర మత గ్రంథాలలో చెప్పబడిన ధార్మిక జీవనాన్ని ప్రతిబింబింపచేలట్లు వుంటాయి. మానవ స్వభావాలలో గల సూక్ష్మమైన వక్రతవలన మనుష్యులంతా అతి తేలికగా అర్థమయ్యే ఆధ్యాత్మిక బోధనలను కూడా అపార్థం చేసుకుని, మొండి వైఖరితో వాటి పైనే ఆధారపడి ఆచరణలో కూడా పెడమార్గం పడుతున్నారు. సత్యస్వరూపమైన దైవత్వం పొందడానికి దేవుని పట్ల సంపూర్ణ శరణాగతి మరియు ఆయన స్వరూపమే అయిన సమస్త జీవరాశిపట్ల నిర్మలమైన ప్రేమ. స్వచ్ఛమైన ధార్మిక జీవనాన్ని గడుపుటయూ ఆచరించక తప్పదని అన్ని మతాలూ బోధించి వున్నాయి. అయితే దైవం యందు కపటమైన ప్రేమను కనపర్చుటయు, తోటి జీవులపైన కక్షలు పూనడము, పతితమైన జీవితాన్ని గడుపుటయూ వంటి పరిస్థితికి దిగజారకుండా వున్న మతాలు చాలా అరుదు. మతాలు అలా కలుషితమైనపుడు ప్రజల అభిప్రాయాలను సవరించి వీలైనంత ఎక్కువ మంది ప్రజలను మళ్ళీ సన్మార్గానికి మళ్ళించడానికి మహాత్ములు మన మధ్య వుండటం ఎంతైనా అవసరం. మతం అటువంటి మహాత్ములవలనే నిలుస్తుంది. వారి భుజస్కంధాలపైనే నిలబడుతుంది.

తాజుద్దీన్ సర్కార్ ఇస్లాం మతంలోని ప్రథమశ్రేణిలోని మహాత్ములలో ఒకరు. ఆయన లక్షా ఇరవై అయిదు వేల (1,25,000) మందిని తనంతటి మహాత్ములుగా చేశాకనే జగత్తుతో తనకు గల సంబంధాన్ని తెంచుకుంటానని ప్రకటించి, తాను దయాగుణానికి మూల స్తంభమువంటివాడు అని నిరూపించుకున్నారు. మహాత్ములకు మృత్యువు లేనే లేదని, వారు చిరంజీవులని మనకందరకూ తెలుసు. వారి సమాధులలోని మట్టి సహితమూ సత్యాన్వేషకులకు ఉపదేశాలను, ప్రోత్సాహాన్ని ఇవ్వగలిగినంతటి ఆధ్యాత్మిక శక్తి ఉంటుంది. దీని వలన 1,25,000 మంది మహాత్ములు తయారయ్యే వరకు తాజుద్దీన్ సమాధి అటువంటి ఆధ్యాత్మిక శక్తి కలిగి వుంటుందని మనం గుర్తించాలి.

ఒక మనిషిని మహాత్ములుగా తీర్చిదిద్దటం ఖాలీ మాటలు కాదు. సామాన్యమైన ఆధ్యాత్మిక ప్రబోధనం ద్వారా వారిలో దైవం పట్ల విశ్వాసాన్ని కలుగజేయవచ్చు. అయితే లౌకిక కట్టుబాట్లను అధిగమించి జీవితాలను సత్యాన్వేషణకు అంకితం చేయడానికి సద్గురువు యొక్క పూర్తి రక్షణ అవసరం! అటువంటి సద్గురువే తాజుద్దీన్ బాబా కూడా. అటువంటి రక్షణను తన భక్తులకు, మానవ సంఘానికి ఆయన ఎలా కల్గించారో చదవడం కుతూహలంగా ఉంటుంది.

అబ్దుల్ అజీజ్ అనే ఆయన సద్గురువు కోసం అన్వేషణ సాగిస్తున్నారు. అనేక మంది పీర్లు ఆయనను తమ భక్తకోటిలో చేర్చుకోవడానికి ప్రయత్నించారు. అయితే అబ్దుల్ అజీజ్‌కు మాత్రం వారి యందు గురుత్వ భావమేర్పడలేదు. ఒకరోజు ఆయనకు కలలో ఒక మహాత్ముడు దర్శనమిచ్చారు. మరునాడు ఉదయం తన కలలోని మహాత్ముని వర్ణిస్తూ తన మిత్రులతో చెప్పాడు అబ్దుల్ అజీజ్. అందులో ఒక మిత్రుడు అబ్దుల్ అజీజ్ చెప్పిన మహాత్ముడు తాజుద్దీన్ బాబాను పోలి వున్నాడని చెప్పి బాబా పిచ్చాసుపత్రిలో వుండగానూ, సక్కర్దరాలో వుండగానూ కనపరచిన అద్భుత లీలలను గూర్చి అతనికి చెప్పారు. అది విన్న అజీజ్‌కు తాజుద్దీన్ బాబాను దర్శించాలన్న కోరిక గాఢమై 1908లో అతను వాకీలో బాబాను దర్శించాడు. అజీజ్ వాకీ వచ్చినప్పుడు తాజుద్దీన్ బాబా చెట్టు క్రింద కూర్చుని వున్నారు. అజీజ్‌ను చూస్తూనే తాజుద్దీన్ బాబా నేలమీదనుండే గడ్డిపరక నొకదానిని తీసుకొని దానితో తన కఫ్నీ అంచుమీద అబ్దుల్ పూర్తి పేరు వ్రాసి అతనిని చూచి చిరునవ్వులొలికించారు. తన పూర్తి పేరు బాబాకెలా తెలిసింది అని అజీజ్ ఆశ్చర్యపోయాడు. ఈ సంఘటన అతనిలో సహజమైన నమ్మకాన్ని కలిగించింది. అజీజ్, వాకీలో బాబా సన్నిధిలో చాలా రోజులు గడిపాడు. ఆ కాలంలో ఇతడు తాజుద్దీన్ బాబా తన పేరును ఆయన కఫ్నీ అంచుమీద వ్రాసుకుని తనను ఆయన శిష్యునిగా అంగీకరించి, తన రక్షణ భారాన్నంతా ఆయనే వహించదలచారని అర్థం చేసుకున్నాడు. రోజులు గడిచిన కొద్దీ అటువంటి అజీజ్ నమ్మకం యింకా యింకా దృఢతరం కాసాగింది.

తాజుద్దీన్ బాబాకు అప్పుడప్పుడు కలిగే దివ్యావేశభావాల వలన ఉద్రేకపూరిత విచిత్రమైన కోపంతో భక్తులను కొట్టేవారు కూడా. అయితే అది ఒక రకమైన

బాబా చేతికిచ్చి, "గట్టిగా పట్టుకో ఇహపరాల గురించి నువ్వు భయపడనవసరం లేదు" అంటూ తన చున్నీలను కరీంబాబా తలచుట్టూ చుట్టారు. తర్వాత ఆయన కరీం బాబా చేతిలో కొన్ని మధురపదార్థాలను పెడుతూ "ఇది వివాహ సమయంలో ఇచ్చే కానుక" అన్నారు. అందుచేత తాజుద్దీన్ బాబా భక్తులందరిలోకి కరీంబాబాకు ప్రత్యేక స్థానం వుంది.

ఫతే మహమ్మద్ అనే ఆయనను మహాత్మునిగా తీర్చిదిద్దిన తాజుద్దీన్ బాబా లీల యింకా అద్భుతమైనది. ఫతే మహమ్మద్ షా ఆఫ్ఘనిస్తాన్ నుండి భారతదేశం వచ్చి, హోశంగాబాద్ జిల్లాలోని ధార్వా అనే గ్రామంలోని మసీదులో నివసించేవాడు. అతను రాత్రింబవళ్ళూ ధ్యానంలో మునిగి చిత్రమైన సమాధిలో వుండిపోయేవాడు. తాజుద్దీన్ బాబానే ఆయనను ధార్వా గ్రామానికి పంపించారని చెప్పుకుంటారు. ధార్వా గ్రామానికి చేరకముందు ఫతే మహమ్మద్ షా తాజుద్దీన్ బాబాను నాగపూర్ పిచ్చాసుపత్రిలో కలుసుకున్నారు. ఆ సమయంలో తాజుద్దీన్ బాబా తను వుండే సెల్లు గది గురించి యిలా అన్నారు "ఈ గది ఎప్పటికీ ఖాళీగా వుండదు" అని. ఆ మాటలు అక్షరాలా నిజమయినాయి. తాజుద్దీన్ బాబా పిచ్చాసుపత్రిని వదిలి వచ్చినప్పుడు ఆయనున్న గదిలో ఫతేషాను వుంచారు. ఫతేషా కూడ తర్వాత గొప్ప మహాత్ముడైనాడు. తాజుద్దీన్ బాబా సమాధి చెందాక మహారాజా రఘోజీ రావు ఫతేషాను పిచ్చాసుపత్రినుంచి విడుదల చేయించి శక్కర్దరాలో తాజుద్దీన్ బాబా స్థానంలో వుండమని ప్రార్థించాడు. అప్పుడు ఫతేషా యిలా సమాధానమిచ్చారు "ఆ ప్రదేశము మనము శిరస్సున ధరించవలసినట్టిది. మీరు నన్ను అప్పుడే అక్కడకు తీసుకు వెళ్ళదలచారా?" అన్నారు. తాజుద్దీన్ బాబా నివసించిన ఆ ప్రదేశము ఎంతో పవిత్రమైనదని. మన కాళ్ళతో త్రొక్కి దానిని అపవిత్రపరిస్తే పాపం చుట్టుకుంటుందని ఆయన భావం. ఫతేషా నిర్యాణం వరకూ పిచ్చాసుపత్రిలో ఆ 'గది' లోనే వున్నారు. అక్కడ ఆయన నిర్యాణం చెందాక ఆయన శరీరాన్ని తాజుద్దీన్ బాబా సమాధి వున్న 'తాజాబాద్' కు తెచ్చారు. ఫతేషా యింతకు ముందు తాజాబాద్ గురించి అన్న మాటలు ఆయన శరీరాన్ని తలల మీద మోసుకొని తాజాబాద్‌కు తీసుకురావడం గురించి చెప్పిన సూచనగా మనం తీసుకోవచ్చు. లేదా తాజుద్దీన్ బాబా అందుకున్న మహోన్నత ఆధ్యాత్మిక స్థితి.

సమయాన్నంతా "ఆధ్యాత్మిక పరిపూర్ణత పొందడానికి మార్గమేమిటి?" అనే విషయం గూర్చే ఆలోచిస్తుండేవాడు. ఖాదర్ తండ్రిగారు దైవభక్తిగలవారే గనుక అతని మనసుని అర్థం చేసుకొని అతనినేమీ ఆటంకపరచలేదు.

కొన్ని సంవత్సరాల తర్వాత, అభివృద్ధి చెందుతున్న ఒక కంపెనీవారు ఖాదర్ కు మంచి ఉద్యోగం ఇస్తామని అతనిని తమ వైపు త్రిప్పుకోజూచారు. అప్పుడు ఖాదర్ తండ్రి అతని మార్గమదికాదని చెప్పి, అతని మార్గము గమ్యముల గురించి గుర్తు చేశారు. తర్వాత ఒక రోజు ఖాదర్ తండ్రి అయిదు రాగి నాణాలు అయిదుగురు సాధువులకిచ్చమని ఆ విధంగాచేసి తాను తాజుద్దీన్ బాబాకు చెల్లించుకున్న మొక్కును తీర్చమని ఖాదర్ తో చెప్పి, "నేను ఈ రోజు సాయంత్రం వెళ్ళిపోతున్నాను. జాగ్రత్తగా వుండు" అని కూడ చెప్పాడు. తాను చెప్పినట్లే ఆ పరమభక్తుడైన ఖాదర్ తండ్రి ఆ సాయంత్రం ప్రశాంతంగా కన్ను మూశాడు.

అప్పటి నుండి ఖాదర్ షా హృదయం ఒక పరిపూర్ణ మహాత్ముని కోసం వ్యథ చెందసాగింది. ఇప్పటి వరకు ఖాదర్ షా సమాజంలో లెక్కలేనంతమంది గొప్ప ఆధ్యాత్మికవేత్తలుగా నటించే కపట గురువులను చూసి చూసి తనకు సమర్థుడైన గురువు లభిస్తాడా లేదా అని కలవరపడసాగాడు. ఇలా వుండగా ఒకసారి తాజుద్దీన్ బాబా భక్తుడైన హజరత్ బాబా తన గురువు యొక్క ప్రేమపూరితమైన సందేశాన్ని ప్రజలలో వ్యాప్తి చేయడానికి విజయనగరానికి వచ్చారు. ఖాదర్ బాబా ఆయన సందేశాన్ని విని అనతి కాలంలోనే నాగపూర్ ను దర్శించాడు.

మొదటిగా తాజుద్దీన్ బాబాను చూసినప్పుడు తన దర్శనానికి వచ్చిన ప్రజలను ఉచ్చరించరాని పెద్ద తిట్లు తిడుతూ దిగంబరుడుగా వున్న యీ పిచ్చి ఫకీరు ఆధ్యాత్మిక సామ్రాజ్యానికి అధినేత ఎలా అవుతాడు అనుకున్నాడు ఖాదర్. అప్పుడు తాజుద్దీన్ బాబా గుఱ్ఱపుబండిని ఎక్కి బండి వెంటపడుతున్న జనాన్ని అందరినీ తిడుతూ బండి తోలుకుంటూ వెళ్ళారు. ఖాదర్ షా కాలకృత్యాలు తీర్చుకొనడానికి, తన అనుష్ఠానం పూర్తి చేసుకోడానికీ వెనుకనే ఆగిపోయాడు. ఖాదర్ షా తను వెళ్ళదలచుకున్న ప్రదేశానికి నడిచి వెళుతూ వుండగా హఠాత్తుగా తాజుద్దీన్ బాబా ఆయన ముందు ప్రత్యక్షమై, "ఏమిటి నీ

సందేహం ? ఇలా అపార్థం చేసుకున్నావెందుకు ? ఏటువంటి సందేహానికీ ఇక్కడ తావులేదు" అంటూ నిశ్చేష్టుడైన ఖాదర్ స్పృహలోకి వచ్చేటంతలోనే అదృశ్యులైన మాయమయ్యారు.

మరునాడు ఉదయం ఖాదర్ షా హజరత్ బాబా ఇంకా కొందరు భక్తులూ తాజుద్దీన్ బాబా చుట్టూరా కూర్చొని వున్నారు. తాజుద్దీన్ బాబా హజరత్ బాబా వైపు తిరిగి "ఆ మెత్తనైన అంగీకి కొన్ని కుట్లు వేసేరా" అని ఆజ్ఞాపించాడు. గురువు ఆజ్ఞను పాటించడానికి హజరత్ బాబా అక్కడ నుండి లేచి బయటకు వెళ్ళారు. ఖాదర్ కూడా హజరత్ బాబాను అనుసరించి వెళ్ళి ఆయనతో "బాబా ఆజ్ఞలో గూఢార్థం వున్నది. కొద్దిసేపట్లో అంగీలాగా ఎప్పటిలాగా వుండే ఒక ధనవంతుడు ఇక్కడకు రాబోతాడు. అతనికి ఎదురువెళ్ళి అతనికి వివేకం కల్గేటట్లు కొన్ని మాటలు చెప్పమనీ ఆయన భావం" అని చెప్పాడు. ఇది విన్న హజరత్ బాబాకు తన గురువు చెప్పిన మాటలనూ ఖాదర్ బాబా చెప్పిన వాక్యాన్నీ సమన్వయపరచుకోవడం ఎలాగో అర్థం కాలేదు. అయితే కాసేపటికి విలువైన కారులో కూర్చొని ఒక ధనికుడు రానే వచ్చాడు. ఆయన వెండి పళ్ళెంలో అపూర్వమైన కానుకలను తెచ్చారు. వాటిని హజరత్ బాబా అందుకొని తాజుద్దీన్ బాబా వద్దకు తీసుకురాగానే తాజుద్దీన్ బాబా అతనితో "విజయనగరం నుండి వచ్చిన వాడు వివరించి చెప్పినదే నీవేమీ అర్థం చేసుకోలేవా !" అని ప్రశ్నించారు.

తాజుద్దీన్ బాబా భక్తులలో జబల్‌పూర్ బాబా కూడా ఒకరు. చిన్నప్పటి నుండి ఆయన తాపస మూర్తీభవించి వున్నట్లు అన్నట్లు వుండేవాడు. ఒకరోజున శ్రద్ధాళువులైన కొంతమందికి జ్ఞానబోధ చేస్తుండగా ఒక మూలన వింటూ కూర్చున్న యువకుడైన ఖాదర్ మీద ఆయన దృష్టి పడింది. వెంటనే జబల్‌పూర్ బాబా పారవశ్యంలో ఖాదర్‌కు అణకువతో నమస్కరిస్తూ "ఓ మహాత్మా! నీ శక్తిని నాకు చూపించు" అంటూ గొణగసాగారు.

గందరగోళంగా వున్న ఈ సన్నివేశాన్ని చూసిన ఖాదర్ విభ్రాంతితో అక్కడ నుండి వెళ్ళిపోయాడు. తర్వాత ఆ భక్తులంతా తాజుద్దీన్ బాబా దగ్గరకు వెళ్ళారు. అప్పుడాయన జబల్‌పూర్ బాబాతో "నా శక్తిని నీవు చూడాలనుకుంటున్నావా ! నా ఆధ్యాత్మిక శక్తిని నీవు సంతరించుకున్నావా?" అని అడిగారు. అప్పుడాయన

యువకుడైన ఖాదర్ షా, తామూ ఒక్కరేనని తాజుద్దీన్ బాబా చెప్పారని గుర్తించారు.

మరొక సందర్భంలో హజరత్ బాబా, ఖాదర్ బాబాను పిలిచి వంటకు ఉపయోగపడేలా కట్టెలు కొట్టవలసినదిగా కోరారు. ఖాదర్ బాబా ఆయన మాటలు శిరసావహించారు. అయితే ఖాదర్ బాబాకు కట్టెలు కొట్టడం ఎప్పుడూ అలవాటు లేకపోవడంతో ఆయన చేతులు బొబ్బలు ఎక్కాయి. తర్వాత హజరత్ బాబా ఖాదర్ బాబాకు ఎదురు వచ్చినప్పుడు ఆయన కోపంగా, "ఓరి మూర్ఖుడా ! నా చేతులు చూడు. ఎలా బొబ్బలు ఎక్కాయో. నీవు నా చేత కట్టెలు కొట్టిస్తావా !" అన్నారు.

మనకు ఆశ్చర్యం కొల్పే విషయమేమిటంటే ఖాదర్ నాగపూర్ వచ్చి మూడు రోజులైనా ఆయన తాజుద్దీన్ బాబాతో ఒక్కమాటైనా మాట్లాడలేదు. నాల్గవరోజు తెల్లవారు జామున ఖాదర్‌కు ఒక కల వచ్చింది. ఆ కలలో అతనికి పెద్ద భోషాణాలు రెండు కనిపించాయి. వాటి తాళం చెవులను ఎవరో అతని చేతికి ఇచ్చారు. వాటితో ఆయన ఆ రెండు భోషాణాలను తెరచి చూశారు. వాటిలో ఒక దాంట్లో నిండుగాను, రెండవదాంట్లో సగానికీ పవిత్రమైన గ్రంథాలు ఉన్నాయి. ఈ కల పూర్తయి ఖాదర్ నిద్ర నుండి లేవగానే అతని ప్రక్కనే తాజుద్దీన్ బాబా నిలబడి దర్శనమిచ్చారు. ఆ ప్రదేశాన్నంతా చిమ్ముతున్న ఒక వృద్ధ స్త్రీ కూడా తాజుద్దీన్ బాబా ఇక్కడ నిలబడి వుండటం చూసి అక్కడ నిద్రపోతున్న మిగతా భక్తులందరినీ లేపింది. అంతలోనే తాజుద్దీన్ బాబా అదృశ్యులై పోయారు. తర్వాత తనకు కల్గిన అనుభవాన్ని ఖాదర్‌బాబా అమాయకుడుగా హజరత్ బాబాకు చెప్పినప్పుడు తాజుద్దీన్ బాబా ఖాదర్ బాబాతో ఇలా అన్నారు. "బాబూ ఇటువంటి అనుభవాలను నీవు యితరులతో ఎప్పుడూ చెప్పొద్దు. అయినా ఇప్పుడు ఏకేం భయంలేదు" అంటూ చిరునవ్వుతో ఆశీర్వదించారు.

త్వరలోనే ఖాదర్ షా విజయనగరానికి తిరిగి వెళ్ళి అక్కడ తీవ్రమైన ఆధ్యాత్మిక సాధనలలో తన కాలాన్నంతా వెచ్చించసాగాడు. ఆయన సాధనలు శీఘ్రంగానే ఫలించి ఆయన కూడా గొప్ప మహాత్ములయ్యారు.

అసంఖ్యాక జనవాహిని లౌకిక, ఆధ్యాత్మిక సమస్యల పరిష్కారానికోసం ఖాదర్ బాబా దగ్గరకు పరుగులిడేవారు. ఖాదర్ బాబా సమాధి చెందిన తర్వాత భక్తులు ఆయన ఆశీర్వచనాన్ని నేటికీ కూడ పొందుతూనే వున్నారు. బాబా ఖాదర్‌వలీ మానవాళికై తాజుద్దీన్ బాబా వెలిగించి ఇచ్చిన ఒక జ్యోతి. తన గురువంతటి వాడైన బాబా ఖాదర్‌వలీ కూడ తనంతటి శిష్యులను ఎందరినో తయారుచేశాడు.

## అధ్యాయము - 7

## మృత్యుంజయుడు

మానవజాతిని పాపం నుంచి, దాని ఫలితమైన మృత్యువు నుంచి రక్షించడానికే అవతరించానన్న జీసస్ క్రీస్తు, మృత్యువు, వృద్ధాప్యము, రోగముల బారిన పడకుండా బైటపడే మార్గాన్ని అన్వేషిస్తానని ప్రతిజ్ఞ చేసిన బుద్ధుడు కూడ అందరి మానవులలాగే మృత్యువాతబడ్డారు కదా ! మరి వారు చేసిన ప్రతిజ్ఞలన్నీ ఎలా నెరవేర్చుకున్నట్లు ? అనే అనుమానం సామాన్య మానవులకు కలుగవచ్చు. ప్రవక్తలయొక్క, మహాత్ముల యొక్క జీవితాలు సామాన్య జనుల జీవితాలవంటివి గాక అందుకు భిన్నంగా వుంటాయని, వారికసలు మృత్యువనేదే లేదని, వారు శాశ్వతమైన ఆధ్యాత్మిక స్థితిలో యెప్పుడూ జీవించే వుంటారనీ సమాధానం చెప్పినప్పుడు సామాన్య జనులకు నమ్మడం కష్టంగానే వుంటుంది. ఇటువంటి మన నమ్మకాన్ని చూచి నాగరికులు తరచుగా "నవ్వుతూ" వుంటారు. అన్నప్పటికీ నవ్వు నిజాన్ని నమ్మ చేయలేకపోగా, అనుమానాన్నే వ్యక్తపరుస్తుంది.

ఏదైనప్పటికీ యీ ప్రవక్తలు, దైవాంశ సంభూతులూ తమ శిష్యులను దైవ న్యాయాన్ననుసరించి నడువవలసిన ఆధ్యాత్మిక క్రమశిక్షణా రీతులను యేర్పరచారు. ఆ పద్ధతులను అనుసరించినట్లయితే ప్రతి వ్యక్తి తామనుకున్న ఉన్నత శిఖరాలను చేరుకుంటారని, పూర్ణ జ్ఞానాన్ని పొందుతారని ప్రవచించారు. పవిత్ర హిందూ మత గ్రంథాలలో హిందూ ఋషులు క్లుప్తంగా వివరించిన వివిధ రకాలైన యోగమార్గాలు, బుద్ధుడు ప్రవచించిన అష్టాంగ మార్గము, జీసస్ క్రీస్తు

వరబారు. ఆయన ఎప్పుడెప్పుడు ఎవరెవరికి భౌతికంగా దర్శనమిచ్చారో గుర్తు తెచ్చుకోవడం అవసరం.

హజరత్ తాజుద్దీన్ బాబా ప్రదర్శించిన అటువంటి లీలలలో అహమ్మద్ అలీషా అనుభవాన్ని చెప్పుకోవచ్చు. జీవించి వుండగానే సంకల్ప మాత్రాన రకరకాల వేషాలలో వివిధ ప్రదేశాలకు వెళ్ళగలిగిన శక్తిమంతునికి సమాధి అనంతరం అటువంటి లీలలు ప్రదర్శించడం ఏమంత కష్టం! తాను 1 25.000 మంది మహాత్ములను తయారు చేసే వరకూ యీ ప్రపంచంతో సంబంధం కలిగి వుంటానని, ఆయన పిలిచిన విచారణ దినం వరకు విశ్వమానీ లక్షలాది సంవత్సరాలు మహారాజా రఘోజీరావ్ భవనంలోనే విశ్రమిస్తానని ఆయన ప్రకటించి వున్నారు. అందువలన భౌతిక కాయాన్ని పరిత్యజించిన అనంతరం కూడా ఆయన జీవించి వుంటారనే సంగతి వారికి ముందే తెలుసునని మనం గ్రహించవచ్చు.

అందుచేతనే బాబా తాజుద్దీన్ ఔలియా సత్యాన్వేషణకు సరియైన దారి చూపడానికి తాము భౌతిక కాయంతో వున్నప్పటిలాగానే ఎప్పుడూ సిద్ధంగానే వున్నారు. ఒక్కొక్కసారి ఆయన లీలల ద్వారా, మరొకసారి భౌతిక రూపంలోనూ దర్శనమిచ్చి భక్తులకు తగిన సందేశాలను యిస్తూ ఉంటారు. భౌతిక ప్రపంచం యిదంతా నమ్మినా నమ్మకపోయినా ఆయనను నమ్ముకున్న భక్తులు మాత్రం చిక్కు సమస్యలలో అందరికీ ప్రభువైన దేవుణ్ణి వేడుకొని ఆయన అందించే సందేశాలను, ఆశీర్వచనాలనూ నమ్మకంతో స్వీకరిస్తారు

## అధ్యాయము - 8

## మహాత్ముడు - ఆవశ్యకత

మనం యింతవరకూ తెలుసుకున్నట్లుగా హజరత్ తాజుద్దీన్ ఔలియా బాబాను గురువుగా అవతరించిన మహాత్ముడు. వివిధ ప్రపంచ ప్రజలు మనుగడకు మతాలకు చెందిన ప్రజల మధ్య పరస్పర అవగాహన, సోదరభావం తప్పనిసరి అవుతున్న

కాలం గడపమని ఆదేశించింది. ఒకరోజున తాజుద్దీన్ బాబా మెహర్ బాబాతో "కనులు మూసుకొని దేవుని వాక్యం చదువుము!" అని ఉపదేశించాడు. అందుకేనేమో మెహర్ బాబా తనజీవిత శేషమంతా మౌనంలోనే గడిపాడు.

1958 సంవత్సరంలో మెహర్‌బాబా మళ్ళీ నాగపూర్ దర్శించినప్పుడు మహారాజా రఘోజీరావ్ ఆయన ఆశీర్వచనాన్ని కోరాడు. అప్పుడు మెహర్‌బాబా "మీరు ఇదివరకే తాజుద్దీన్ బాబా ఆశీర్వచనాన్ని పొంది వున్నారు. ఇంకా నేను చేయవలసింది ఏమున్నది?" అని వ్రాసారు. తర్వాత ఆయన తాజుద్దీన్ బాబా మందిరానికి వెళ్ళి అక్కడ కొంత సేపు ధ్యానంలో మునిగిపోయారు. తాజుద్దీన్ బాబా ముఖ్య శిష్యులలో ఒకరైన కరీం కూడా అక్కడకు వెళ్ళి "మెహర్ బాబా, నా కోసం కూడా ప్రార్థించండి" అని మౌనంగా ప్రార్థించాడు. వెంటనే మెహర్ బాబా తాజుద్దీన్ బాబా చిత్రపటాన్ని చూపుతూ "తాజుద్దీన్ బాబాను తన గుండె నిండా నింపుకున్న వాని కోసం ప్రత్యేకంగా నేనేలా ప్రార్థించేది?" అనే అర్థాన్ని స్ఫురింపజేటట్లు చేసారు. దీని వల్ల మెహర్ బాబాకు తాజుద్దీన్ బాబా పట్ల ఎంతటి శ్రద్ధాభక్తులున్నాయో మనము గ్రహించవచ్చు.

## నీలకంఠరావ్

మహారాష్ట్రకు చెందిన నీలకంఠరావ్ జబల్పూర్‌లో ఒక ఆఫీసులో ఉద్యోగి. ఆయన ప్రతిరోజూ తాజుద్దీన్ బాబా ఫోటో ముందు అగరువత్తులు వెలిగించి నమస్కరించేవారు. ఒక రోజు అతడు తీవ్రమైన ధ్యానంలో మునిగిపోయి తాజుద్దీన్ బాబా ఫోటోను తన ముందుంచి, పరిసరాలనూ పూర్తిగా మరచిపోయాడు. వెంటనే అతని ముందు తాజుద్దీన్ బాబా ప్రత్యక్షమయ్యారు. 'హాల్' అనే స్థితిని పొందిన నీలకంఠరావ్ ఆనందపారవశ్యంలో బాహ్యస్పృహను కోల్పోయాడు. ఇంటిలోని వారందరూ ఆందోళనతో డాక్టరుకు కబురు పంపారు. అయితే నీలకంఠరావు మర్నాడు ఉదయానికి గాని స్పృహలోకి రాలేదు. 'హాల్' అనుభవం తాలూకు ఛాయలు అతని ముఖంలో స్పష్టంగా గోచరిస్తున్నాయి. ఆ స్థితిలో నీలకంఠరావు తాజుద్దీన్ బాబాను దర్శించి ఆయన సన్నిధిలో కొంతకాలం గడిపారు. ఒకరోజున తాజుద్దీన్ బాబా నీలకంఠరావును సాయి ఖేడా నివాసియైన శ్రీకేశవ్‌రాజ్ 'ధునీవాలా' అనే మరొక మహాత్ముని దర్శించుమని పంపారు. ఆ మహాత్ముడు

హిందూ మత సాంప్రదాయానికి చెందిన సద్గురువు

నీలకంఠరావ్‌తో పాటు కరీంబాబా గూడ సాయి ఖేడా బయలుదేరాడు వారింకా ధునీవాలాదాదా ఆశ్రమానికి చేరకముందే నీలకంఠరావు ఆనంద పారవశ్యంతో నృత్యం చేస్తూ ఇలా పాడనారంభించాడు "మహమ్మద్ ప్రవక్త శిరోజు పొందిన గమ్యం చేరుట కష్టం. మార్గం తెలిసిన మహానుభావులే మనందు చేస్తాను తీరం సద్గురు కృపయను అమృతపానమే తెలియగలేయును ఎక్కడో" వారిరువురూ సాయిఖేడా చేరగానే చుట్టూ వున్న భక్తుల మధ్య ఎత్తైన వేదిక మీద కూర్చొని వున్న దాదాజీని చూశారు ఆయన చుట్టూ గల భక్తులు. ఎంతటి వారి నైనా మార్పు చేయ గల దాదాజీ శక్తిని పొగడుతూ పాడుతున్నారు. దాదాజీని చూస్తూనే నీలకంఠరావు ఆనందంతో మోకాళ్ళమీద నడుస్తూ ఆయనను సమీపించి, పారవశ్యంతో పూర్తిగా ఆయన వున్న వేదికనెక్కి ఆయన ముందు సాష్టాంగపడి బిగ్గరగా తాజుద్దీన్ బాబా అని అరిచాడు. దాదాజీ నవ్వుతూ, తాజుద్దీన్ బాబా ఒక కుండలో పడిపోయాడు. చేతనైతే నీవు బయటకు తీయి అంటూ నీలకంఠరావు నోట్లో ఒక తిరిటే ముక్కను పెట్టారు ఆయన చెప్పిన మాటలలో నిగూఢం ఆధ్యాత్మిక పరిభాషతో పరిచయమున్న వారికి సులభగ్రాహ్యమే.

హృదయమనే కుండలో గల సత్యాన్ని నీలకంఠరావు వివేకంతో తెలుసుకోవాలని ఆయన భావం. శిష్య నీలకంఠరావు దాదాజీలో తాజుద్దీన్ బాబా స్వరూపాన్ని చూసి ఆశ్చర్యంతో బిగ్గరగా "తాజుద్దీన్ బాబా" అని అరిచి వుండాలి. అందువల్లనే దాదాజీ తాజుద్దీన్ బాబా అంటే ఆయన నామరూపాలు మాత్రమే కాదని. సకల సాధువుల రూపాలలో వున్న ఆత్మ ఒక్కటేనని తెలుసుకోమని హెచ్చరించారు.

తాజుద్దీన్ బాబాకు బాలాజాన్‌తోనూ, సాయిఖేడా నివాసియైన ధునీవాలా దాదాజీతోనూ వున్నటువంటి ఆధ్యాత్మిక సంబంధమే శ్రీ శిరిడీ సాయిబాబా, తాజుద్దీన్ బాబాల మధ్య గూడా వుండేది. "ఇప్పుడు అవసరమైతే తాజుద్దీన్ బాబా అక్కడికి వెళ్ళండి" అని చెప్పి తన దగ్గరకు వచ్చిన కొందరు భక్తులను తాజుద్దీన్ బాబా దగ్గరకు శిరిడీ సాయిబాబా పంపుతుండేవారు, అలాగే తాజుద్దీన్ బాబా గూడా ఎంతో మందిని వారి ఆధ్యాత్మికోన్నతికై శిరిడీ సాయిబాబా వద్దకు పంపేవారు.

## శ్రీ ఉపాసనీ మహరాజ్

సాకోరి నివాసి, శ్రీ సాయిబాబా ముఖ్యశిష్యుడూ అయిన శ్రీ ఉపాసనీ బాబా తరచూ తాజుద్దీన్ బాబా దర్శనార్థం వాకి, సక్కర్దా సందర్శిస్తుండేవారు. తాజుద్దీన్ బాబాకు ఉపాసనీ మహరాజ్ అంటే ఎంతో అభిమానముండేది. తాజుద్దీన్ బాబా తన భక్తుడైన డా॥ పరమానస్కర్‌ను ఆధ్యాత్మిక శిక్షణ, ఆశీర్వాదాల కొరకు శ్రీ ఉపాసనీ మహరాజ్ వద్దకు పంపారు. ఆ సందర్భంలో [illegible] డా॥ దేశ్‌పాండే ఇలా వ్రాశాడు. "డా॥ పరమానస్కర్ సామాన్యమైన మహాత్ములను చూసి అంత తేలికగా ఒకరి ముందు తలవంచే మనిషి కాదు. కానీ ఆ ఫకీరు ప్రదర్శించిన అపూర్వ మహిమలను చూసి, ప్రేమ పూరితమైన ఆయన బోధనలను విని విజ్ఞానియైన ఆ డాక్టరు తాజుద్దీన్ బాబాకు పాదాక్రాంతుడైనాడు"

తాజుద్దీన్ బాబా ప్రోత్సాహంతో డా॥ పరమానస్కర్‌కు ఉపాసనీ బాబా పట్ల కూడా దృఢమైన భక్తి కుదిరింది. ఆయన ఉపాసనీ బాబాను గురువుగా అంగీకరించమని డా॥ పరమానస్కర్‌ను ఆదేశించారు. తాజుద్దీన్ బాబా చెప్పిన నిదర్శనాలన్నీ సాకోరిలో ఉపాసనీ మహరాజ్ వద్ద లభించడంతో డా॥ పరమానస్కర్‌కు ఉపాసనీ మహరాజ్ మీద గల నమ్మకం మరింత దృఢపడింది. మనం గుర్తించవలసిన విషయమేమిటంటే పాట్నా నివాసి పీర్ సాహెబ్ బ్రహ్మచారిబాబా, తాజుద్దీన్ బాబా, చివరిగా ఉపాసనీ మహరాజ్ వీరందరూ కలిసికట్టుగా డా॥ పరమానస్కర్‌ను ఆధ్యాత్మికాభివృద్ధికి తోడ్పడ్డారు.

బెంగాల్‌కు చెందిన మహాత్ముడు హరనాథ్‌కుసుమ్ తాజుద్దీన్ బాబా సమకాలికులు. ప్రముఖ మహమ్మదీయ మహాత్ములందరిలో ఒకరు, అజ్మీర్ నివాసియైన 'వాహ్‌బాబాకల్లొలాద్‌షా' కూడా తాజుద్దీన్ బాబా పైన ప్రేమ, గౌరవాలు కలిగి వుండేవారు. వారు తమ అనుచరులలో వందలాదిమందిని తాజుద్దీన్ బాబా ఆశీర్వాదం కోసం నాగపూర్ పంపిస్తూ వుండేవారు. ఈ విధంగా మహాత్ములందరూ జాతి, కుల, మత వివక్షలు లేకుండా సరియైన ఆదర్శాన్ని, సోదరభావాన్ని పెంపొందించడానికి కృషి చేస్తుండగా నేటి మన సమాజంలోని అనేక వర్గాల సంకుచిత వైఖరిలో పరభేదభావాలను ఆశ్రయిస్తూ, ఒకరిపట్ల ఒకరు ప్రేమ లేకుండా ప్రవర్తిస్తున్నారనే విమర్శలు వినిపిస్తూ వుండడం విచారకరమే. ఇక్కడ

జ్ఞాపకం చేసుకోవలసిన విషయం మరొకటున్నది. శ్రీ శిరిడీ సాయిబాబా ఒకసారి, "మేము (సాయిబాబా తాజుద్దీన్ బాబా, సాయి ఖేడా నివాసి ధునీవాలాదాదా నాసిక్ నివాసి నరసింగ్ మహరాజ్, అక్కల్కోట స్వామిసమర్థులు, శేగాం నివాసి గజానన్ మహరాజ్ — మేమందరమూ దత్తాత్రేయ అంశలతో అవతరించి. పరస్పర సహకారంతో ఒక లక్ష్య సాధనకు పాటుపడుతున్నాము" అని చెప్పారు.

ఇస్లాం మతస్థుడైనా – హిందూ మతస్థుడైనా ఏ వ్యక్తి అయినా సరే, క్రమశిక్షణలో పవిత్రమైన జీవితాన్ని గడుపుతూ అందరికీ ప్రభువైన దేవునికి శరణాగతుడైనప్పుడు – ఆ భగవంతుడే ప్రేమతోను, అంతులేని దయతోనూ తనకు ప్రేమపాత్రులైన వారికి కొన్ని ఆధ్యాత్మిక శక్తులు ప్రసాదిస్తారు. మహాత్ములందరూ దేవునికి సన్నిహితులు అదృశ్యప్రాయమైన వివిధ మత జీవితాలకు వారు వెలిగిపోని చిహ్నాలు. అటువంటి మహాత్ములే వారి మధ్య గల సంబంధాలతో సంకుచితమైన మత దురభిమానాలకు అతీతులై ప్రవర్తిస్తున్నప్పుడు వారి మతాలకే వారసులమైన మనం మాత్రం ఒకరినొకరం ద్వేషించుకోవడం ఎందుకు ?

## ప్రేమజ్యోతి

దైవం ప్రేమ స్వరూపం. నిరంతరధ్యానం వల్ల మహాత్ములు తమ అహంకారాన్ని ఆ దైవమందు లయింపజేసి దైవ స్వరూపమైన ప్రేమతత్త్వమే తాముగా మూర్తీభవించి వుంటారు. అహంకారం సంపూర్ణంగా ఆయనయందే లీనమైనప్పుడు అటువంటి మహాత్ముల కరుణ కూడా దైవం వలెనే విశ్వమై ఉంటుంది. "స్వర్గ రాజ్యమందలి నీ తండ్రి వలె నీవు కూడా నిర్మలుడవైయుండుమ" అని జీసస్ తన భక్తులకు చెప్పినందుకే, భగవంతుడు మానవుల పాప పుణ్యాలను పట్టించుకోకుండా ఎండను, వానను ప్రసాదిస్తున్న ప్రత్యక్షమైన గౌతమబుద్ధుడు. క్రీస్తు, మహమ్మద్ మొదలయిన వారి కరుణ కూడా అలాంటిదే. వివిధ మతాలలో అత్యుత్తమ స్థితులను పొందిన మహాత్ములందరూ సత్త్వంలోను ప్రేమలోను భగవంతునకు అతి సన్నిహితంగా వుంటారు. తాజుద్దీన్ బాబా అటువంటి స్థితిపొందిన మహాత్ములలో ఒకరనడానికి సందేహమేమాత్రమూ లేదు. అందుకు నిదర్శనాలు చూద్దాం

ఒక రోజున ఒక వేశ్య హజరత్ తాజుద్దీన్ బాబాను ఆరాధించడానికి వచ్చి ఈ విధంగా పాడింది

"పుణ్య జీవులే పున్నారెక్కడ
పాపులు వేరే తీరమెక్కడ?"

అది విని తాజుద్దీన్ బాబా వెంటనే యిలా సమాధానమిచ్చారు. "మంచి వాళ్ళంతా అల్లాకే పోండి. పాపాత్ములంతా నా వెంటకు రండి" అన్నారు. ఎంతటి కరుణ!

మరొక సందర్భంలో తాజుద్దీన్ బాబా సక్కర్దారాలో ఒక దేవాలయాన్ని ఆనుకొని కూర్చున్నారు. వేలకొలది భక్తులు ఆయన చుట్టూ మూగారు. బాబా వారిని చూచి తన దృష్టిని ఆకాశం వైపు నిగిడ్చి ఇలా పలికారు "ఓ దేవా! వీరు చేసిన పాపాలన్నింటికీ సమాధానం వారి నడుగకుండా నన్నే అడుగు. ఎందుకంటే వారందరూ నాకు చెందినవారే!" తన భక్తుల పాపాలకు తానే బాధ్యత వహించడమంటే మన పట్ల వారికి ఎంతటి దయ వుండి వుండాలో గదా!

తాజుద్దీన్ బాబా గురువుగా తన శిష్యులను ఎంతటి సమర్థవంతంగా తీర్చి దిద్దేవారో అంతగానూ తమ భక్తులను కన్న తల్లికంటే ఎక్కువగా ప్రేమించేవారు. వారిని దేనికొరతా ఎప్పుడూ ఆయన దగులు పడనివ్వలేదు. ఆయనకు సేవ చేసుకోవడము. రోగ నివారణ మొదలైన న్యాయమైన వారి కోర్కెలను ఆయన నెరవేరుస్తూ ఆధ్యాత్మికంగా వారిని ఉన్నతులను చేసారు.

ఒకసారి అల్లాఉద్దీన్‌ఖాన్ అనే భక్తుడు ఎంతో మంది తాజుద్దీన్ బాబా వద్ద సేవ చేస్తుండగా చూచి తనకట్టి అవకాశం లభించనందుకు తనను తాను తిట్టుకున్నాడు. వెంటనే తాజుద్దీన్ బాబా లేచి కూర్చొని, "నా సన్నిహితులెవరినీ నేను దురదృష్టవంతులుగా వుంచను, నేనెవరి తత్రంమను కాను" అన్నారు. అల్లాఉద్దీన్ యీ మాటలకు విస్మయపోయి కృతజ్ఞతతో ఆయనకు నమస్కరించాడు.

షాహెబ్ బాబా అనే మరొక భక్తుడు ఖురాన్‌లోని ఇనాయా-ముత్తస్సాలీ-నరీకాన్-ముజీమిల్ అనే వాక్యానికి అర్థం తనకు స్ఫురింపచేయాలని తాజుద్దీన్ బాబా చేయాలని ప్రార్థించాడు. తాజుద్దీన్ బాబా నవ్వుతూ అతనితో "అవును,

లాంటి అంధులు కూడా మనసులోనే చదువుకోగలుగుతారు" అంటూ తన భక్తులను చూపించారు. ఈ మాటలలోని వారి భావమేమంటే ఖురాన్ చదువగల్గి నటువంటి పరిజ్ఞానం వారికి లేకపోయినప్పటికీ ఖురాన్ తత్వాన్ని బోధించినందు వలన, తన కరుణ వలనా వారు శరీరభావాన్ని మరచి దేవుని యందే తమ దృష్టిని నిలుపగలిగి వుంటారు. తాజుద్దీన్ బాబా మాటలకు స్వానుభవమే పుస్తక జ్ఞానము కంటే గొప్పదని, దానిని వారికి ఆయన ప్రసాదించారని అర్థం.

## అధ్యాయము - 9

## తాజుద్దీన్ బాబా దివ్యవాణి

సమర్థులైన మహాత్ములు వారి బోధనల యందే జీవిస్తారు. శ్రద్ధాళువులైన శిష్యులకు ఆయన ఏమి బోధించారో ఈ అధ్యాయంలో మనం తెలుసుకుందాం:

1908 సంవత్సరంలో రాజా రఘోజీ మహారాజ్ హజరత్ తాజుద్దీన్ బాబాను సక్కర్దా తెచ్చిన కొట్టిడానికి ఒక సాధువు ఆయనను చూడడానికి వచ్చారు. ఆ సాధువు మెడకు ఒక సంచి వ్రేలాడుతుంది. దాని నిండా చిన్న చిన్న మందుసీసాలు వున్నాయి. ఆ రోజుల్లో తాజుద్దీన్ బాబా ఎక్కువగా సమాధిస్థితిలో పారవశ్యంలో వుంటూ, బాహ్యస్పృహను కలిగినప్పుడు తన చుట్టూ మూగిన వేలాది భక్తుల ప్రశ్నలకు, ప్రార్థనలకు సమాధానాలిస్తుండేవారు. ఎంతో కష్టం మీద ఆయన కొద్ది నిముషాలు మాత్రం బాహ్యస్పృహలో వుండి మళ్ళీ సమాధిలో మునిగి పోయేవారు. ఒక్కొక్కప్పుడు ఆయన తానున్న ప్రదేశాన్ని వదిలి దగ్గరలో వున్న పొలాల్లోను, అడవులలోను తిరుగుతూ వుండేవారు. ఆ రోజుల్లో ఆ సాధువు తాజుద్దీన్ బాబాను దర్శించినప్పుడు బాబా అతనిని ఒక చిన్న గ్రామంలో నివసిస్తూ, ఇరవై నాలుగు గంటలూ రోజంతా దైవప్రార్థన చేసుకుంటూ దైవం యొక్క సర్వవ్యాపకత్వాన్ని ఒక్క క్షణం కూడా మరచిపోకుండా వుండమని సలహా ఇచ్చారు. తాజుద్దీన్ బాబా ఇంకా ఇలా చెప్పారు: "దైవాన్ని తెలుసుకోవడానికి నిజమైన మార్గం మానవసేవయే. ఆ సేవా మార్గాన్నే నేను నీకు ప్రసాదించాను. సాధువులలాగా దుస్తులు వేసుకొని పూజలు, నమాజులూ నోటితో ఉచ్చరించిన

మాత్రాన్నే దైవాన్ని పొందలేము. ఒక్క వ్యక్తి దుఃఖాన్ని తొలగించగల్గితే, సేవ చేసే ప్రతి యాత్రలోనూ వెయ్యి సార్లు హజ్, నమాజులు చేసినంత ఫలితం వస్తుంది." ఎందుకని? తన సేవతో ఎదుట వ్యక్తి హృదయాన్ని ఆనందింపగల్గితే అంతకంటే పవిత్రమైన ప్రార్థనగానీ, తీర్థయాత్రగానీ నిజమైన భక్తునికి మరింకేమీ లేదు. ఎందువల్లనంటే కాబా (మక్కా)లోని పవిత్రమైన ప్రదేశం. కంటే కూడా మానవ హృదయం వెయ్యి రెట్లు విలువైనది. ఆయన ప్రవచనాలు భగవద్గీతలోని వాక్యాలకు, ఖురాన్ షరీఫ్‌లోని వాక్యాలకు సరిగ్గా సరిపోతాయి.

1920 సంవత్సరంలో అదృష్ట ఫకీరు ఒకాయన పక్కగా వచ్చి బాబా ఆశీస్సులు పొందారు. ఆయన బాబా వద్దకు వచ్చిన సమయంలో రాజమందిర ప్రాంతంలో తాజుద్దీన్ బాబా అటూ-యిటూ వేగంగా తిరుగుతూ వున్నారు. బాబా అలా తిరుగుతూ వుంటే ఆ అదృష్ట ఫకీరు ఆయనను సమీపించడానికి తగిన అవకాశం కోసం ఎదురుచూస్తూ బాబాకు కొంచెం వెనకాలే ప్రవక్త మహమ్మదుల వారి స్తుతితోసిన దారూద్ షరీఫ్ మెల్లగా చదువుతూ తిరుగుతున్నాడు. హఠాత్తుగా తాజుద్దీన్ బాబా వెనకకు తిరిగి అతనికిలా చెప్పారు "కోరికలు అదుపులో వుంటు, అప్పుడే దైవాన్ని చేరే బాటలో సాగిపోవడానికి వెలుగు కనిపిస్తుంది. వ్యామోహమువలన, అస్థిరమైన కోరికల వలన కష్టము దుఃఖము సంభవిస్తుంటాయి. అటువంటి వ్యామోహము లేకపోతే ఆనందమే ఆనందం"

మరొకచోట బాబా అతనితో యిలా చెప్పారు "మానవునొక్కడే నిజానికి కోరికలని, కోపాన్ని జయించగల సమర్థుడు, ఈ రెండూ బలమైన శత్రువులు. కోపము, స్త్రీ వ్యామోహము మనిషిని అంధుడిని చేస్తాయి. ఆధ్యాత్మిక మార్గంలో దైవాన్ని చేరడానికి ఈ రెండు శత్రువులను జయించడం తప్ప సాధకునికి మరో మార్గం లేదు."

తాజుద్దీన్ బాబా ఎంతో మంది సాధువులకు, ఫకీర్లకు యిటువంటి అనేక సూచనలిచ్చారు. ఆయనను దర్శించి ఎందరో అనేకాలను పొందిన ఆ కాలపు ప్రజలలో అదృష్టవంతులు బాబా తనకు ఏ విధంగా సందేశమిచ్చారనేది కథనం. బాబా యిలాచెప్పారు

"ఝాన్సీ నుండి ఒక సాధువు బాబా సాహెబ్ దర్శనార్థమై నకర్దరా వచ్చారు. ఆ సాధువు తాజుద్దీన్ బాబా దగ్గరే వుంటూ వుండేవారు. ఒకసారి నేను సాధువును ముక్తి పొందడానికి ఏదైనా సులభ మార్గాన్ని చూపగలడేమోనని అడిగాను. అతను నన్నొక స్మశానములో కూర్చొని 'తాజుద్దీన్, తాజుద్దీన్' అంటూ తాజుద్దీన్ బాబా సాహెబ్ పేరును జపించమని చెప్పారు. ఆ పద్ధతిలో నాకు ఆసక్తి కలిగి నేను స్మశానానికి వెళ్ళి రాసాగాను. మూడవ రోజున నేను స్మశానంలో వుండగా బాబా కోపంగా తిడుతున్నట్లు వినిపించింది. నేను కళ్ళు తెరచి చూచేసరికి అక్కడ ఎవరూ కనిపించలేదు. మళ్ళీ నేను కన్నులు మూసుకొని జపించడం ప్రారంభించాను, మళ్ళీ అటువంటి శబ్దమే వినిపించింది. అందువల్ల నేను జపం చాలించి నకర్దరాకు తెల్లవారుజామున 3 గం॥కు చేరాను. అప్పుడు బాబా నా కుటీరం వద్దనే నిలబడి ఉన్నారు. నేనాయనను సమీపించగానే ఆయన నాతో, "పెద్ద పెద్ద కొండలను త్రవ్వి తీయమని నీకెవడు చెప్పాడు" అన్నారు. తర్వాత నాకొక అగ్గిపెట్టె యిస్తూ, "ఈ గడప, ఆ గడప తిరగడమెందుకు?" అంటూ యింకా మరికొన్ని మాటలు చెప్పారు. అయితే నాకవి అర్థం కాలేదు, అప్పుడు నేను మిమ్మల్ని అర్థం చేసుకోలేకుండా వున్నాను హజూర్! నేను మిమ్మల్ని అర్థం చేసుకోలేకుండా వున్నాను. ఈ మాటలను నా మనస్సులో అనుకున్న వెంటనే నా చెంప మీద కొట్టి అన్నారు : "తెలియనితనాన్ని నటిస్తావెందుకు"? తర్వాత ఆయన తమ ప్రక్కనే నిలబడి వున్న ఒక వ్యక్తి వద్ద నుండి తాడునొక దానిని తీసుకొని, దాని ఒకచివర నాచేతికిచ్చి రెండవ వైపు తాము పట్టుకొని నన్ను క్రిందపడమన్నారు. తాడు క్రింద పడగానే, 'ఇదే మన అంగడి' అంటూ యీ క్రింది గేయం చదివారు :

'ఈ దివ్య జ్ఞానపు అంగడి నా చేత తెరువబడింది.
తీసుకువెళితే ఎంతో కొంత, చేరగలరు దైవం చెంత'

ఆయన ఇంకా యిలా అన్నారు.

'అద్దంలో నా ముఖబింబం, హృదయంలో నీ ప్రతిబింబం
అద్దం వున్నది నా చెంత, నా హృదయం వున్నది నీ చెంత'
"కనులు మూసి వెతికినంత, కనిపించును హృదయమంతా

స్వచ్ఛమైన స్ఫటికమువలె నిర్మించావో దైవమూర్తి?
"పడుతూ లేస్తూ తలుపు తడుతూ, ఓపికలేక వెతుకుతుండుట?
మనస్సు మోసుకపోయే ఫలకంలో నీ ప్రేమమూర్తి వున్నది చూడు"
"మట్టిని సృష్టించావు, నీవే మనిషిని సృష్టించావు,
మనిషిని చేసిన మట్టి మూలకము, నీవు సృష్టించావు"
"ముంతను కొన్నాడు. దానితో నీటిని త్రాగాడు.
ముంతకు వట్టాకు నేలకొట్టిన మనిషిని నీవే సృష్టించావు"

"ఆత్మావలోకనంచేసి తానెవరో తెలుసుకొని అంతటితో ఆగక తాను పరిపూర్ణత చెందే వరకూ సత్యజ్ఞానాల కోసం అన్వేషిస్తాడు. వాడు భగవంతుని తెలుసుకుంటాడు".

మరొకసారి ఆయన ఇలా అన్నారు :

"నీకు దేవుణ్ణి చూడాలనివుంటే నిన్ను నీవు తెలుసుకోవడం ఒకటే మార్గం". తాజుద్దీన్ బాబా తన భక్తులకు శిష్యులకు ఎల్లప్పుడూ ప్రాణాయామం చేయమని చెప్పేవారు. ఇంకా ఆయన భక్తులకు, యోగం లోని తేలికైన పద్ధతులను నేర్పే వారు. "మనోనేత్రం ముందు గురువు యొక్క రూపాన్ని నిలుపుకొని, ఉచ్ఛ్వాస నిశ్వాసాలతో భగవంతుని నామాన్ని జపించండి"

"నీ కోరికలన్నింటినీ గురువు పాదాల చెంత సమర్పణ చేసి నిజమైన విశ్వాసంతో నీ గురువును ఆశ్రయిస్తే తప్పక భగవంతుని మహమ్మద్ ప్రవక్తల వారిని నిస్సందేహంగా పొందుతారని తెలుసుకోండి. కారణం, ఈ దృశ్యాదృశ్య ప్రపంచంలో రెప్పపాటులో సద్గురువు ప్రసాదించలేనిది ఏమీ లేదు' అనేవారు. దీనికాధారంగా ఇలా తత్వాన్ని చదివే వారు :

"ఎప్పుడూ భగవంతుని ఎడబాటుకు పరితాపం చెందుతూ ఇలా ప్రపంచంలో కష్టించి, భగవంతుని యందలి శక్తి చెంత యీ ప్రపంచాన్ని విడవడమే నిజమైన ప్రాణత్యాగం"

"నిన్నే చూస్తూ, నిన్నే తలుస్తూ నీ యందలి ప్రేమతో తన వునికిని మరచిపోవడమే నిజమైన షరీయత్, మారిఫత్ మరియు 'అహ్లెతరీకత్'.

"మీ రూపాన్ని మనోనేత్రం ముందు నిలిపి ప్రతిశ్వాసతో మిమ్ములను గుర్తుంచుకోవడమే నిజమైన భక్తి."

"పక్షి గుడ్ల మీద కూర్చున్నట్లు నీ హృదయం మీద అధిష్ఠించు, ఈ అభ్యాసము నిన్ను పూర్తిగా మార్చి నీకు అద్భుతమైన అనుభూతులను ప్రసాదించగలదు".

"సుఖదుఃఖాలలో స్థైర్యాన్ని నిలుపుకొనేవారిని గూర్చిన ప్రశంస ఖురాన్ షరీఫ్‌లో వున్నది".

"నేను సుఖానికి పొంగను, దుఃఖానికి క్రుంగను, సుఖదుఃఖ సమయాలు అతిథులవలె వచ్చి కొద్దిసేపుండి వెళ్ళిపోయేవే అనే మనస్థైర్యం నాకు కలదు".

"సుఖాపేక్షను పూర్తిగా విసర్జించడమే ఫకీరుకు నిజమైన మార్గం. ఈ విధంగా భగవంతుని పాదాలయందు ఆత్మార్పణ చేసుకొని ఆయన దయపై ఆధారపడితే ఆయన సర్వవిధములా నిన్ను కాపాడి ఇహపరాలలోని సర్వాన్నీ నీవు కోరినా, కోరకున్నా నీకు ప్రసాదిస్తారు."

సంపూర్ణము

తాజుద్దీన్ బాబా సమాధికి రైలు మార్గం : మద్రాసు నుండి ఢిల్లీ వెళ్ళే రైలులోనాగపూర్‌లో దిగి అక్కడ నుండి వాకీ, షక్కర్దారాలో బాబా సమాధిని దర్శించవచ్చు.

